# నా దేశం నవ్వుతూంది

(గేయ సంపుటి)



డా. జె. బాపురెడ్డి

ప్రచురణ

చేతన

సాహితీ సాంస్కృతిక సంస్థ

15/3 అరండల్ పేట, గుంటూరు.

**NAADESAM NAVVUTUUNDI**

Collectoin of Lyrics in Telugu

by Dr. J. BAPU REDDY

First Edition, 1986





Price Rs. 25

Cover design : Bali

Cover printing : Sri Ramanuja Printing Works, Vijayawada.

Published by :

CHETANA SAHITI SAMSKRITIKA SAMSTA
15/3 Arundelpet, Guntur.
With the Financial Assistance of A.P. Government.

*Printed at :*
Don Bosco Technical School Press. Ring Road. Guntur - 7.

# ఆచార్య సి. నారాయణరెడ్డి గారికి
# అంకితం



సి. నారాయణరెడ్డి                    జె. బాపురెడ్డి

ఈ శతాబ్దపు తెలుగు సాహితీవిహాయసంలో
ఉదయించిన నవనవోజ్జ్వల భావభానుబింబము
నవ్వనిపువ్వుల ఆత్మవిశ్వాసపరిమళాలతో కమనీయ
కర్పూరవసంత కావ్యోద్యానాలను నవ్వించిన అపూర్వగేయమహాకవి
అమ్లాన మహాభ్యుదయ భావ పద్మాలయంగా
నవ రస నాగార్జున సాగరం నిర్మించిన నాదశిల్పి
మానవజీవితమే భూమికగా ధరించి విశ్వంభరవేదికపై
దేశ కాల లీలా లసద్రసాభినయం చేసిన
పరిణామ ప్రగతిశీలి విజ్ఞాన ప్రజ్ఞాన ప్రజ్ఞాశాలి
నిత్యసత్యాన్వేషణానంద బృందావినోది
రాగచకచ్చకితానంత తారాపథవిహారి
తెలుగు భాషా సాహిత్య సంస్కృతులకు ఖండఖండాంతర
యశోదీప్తికారుడైన *నారాయణరెడ్డిగారికి*
"నాదేశం నవ్వుతూంది"
నాదేశభావ చిత్రపటాన్ని మా చిరకాల స్నేహానికి అక్షరోపాయనంగా

**అంకితం చేస్తున్నాను.**

# ఆ త్మా వి ష్క ర ణ

ఇది ప్రగతిభావగేయసంపుటి. మొట్టమొదటే ఈ మాట ఇంత సూటిగా ఎందుకు చెపుతున్నానంటే, తర్వాత "కొందరు" పుస్తక సమీక్షకులు విమర్శకులు తమ సహజధోరణిలో "ఇందులో కవిగారు ఎక్కువగా ఆర్థిక సామాజిక జీవితాను భూతులే స్పృశించారు గాని ప్రేమభావ, భక్తిభావ ఇతివృత్తాలు స్పర్శించలేదు" అంటూ వక్రభాష్యాలు చేయకుండా ఉండటానికి. గత మూడుదశాబ్దాలుగా నేను వ్రాస్తున్న కవితలను ముఖ్యంగా గేయాలను మూడు భాగాలుగా కూర్చి ప్రచురించాలని నా సంకల్పం. ఈసంగతి అప్పుడప్పుడు నేను మనవి చేస్తూనే ఉన్నాను. 1985 ఉత్తరఅమెరికాతెలుగుమహాసభల్లో నేను పాల్గొన్న సందర్భంలో ఆవిష్కరించబడిన నా "శ్రీకార శిఖరం" గేయసంపుటిలో కూడ ఈ విషయం పేర్కొన్నాను. అందులో—

"నేను ముప్పై ఏళ్ళుగా వ్రాస్తున్న కవితల్లో మూడు ముఖ్యమైన భావ ధారలు గమనించాను. ఆలోచనశిఖరాలనుండి, అనుభూతుల లోయల్లో నుండి పవహించే ఈ చైతన్యధారలు నిజానికి ఏకైక సత్య సౌందర్య ప్రకటనాత్మకాలే. మనకు అగుపించే ప్రకృతినీ, పరిసరాలను, మనంఅనుభవించే జీవితాల్ని మూడురంగుల్లో చిత్రించుకుంటున్నట్లు మూడు రంగాలుగా అన్వయించుకుంటున్నట్లు నేను గ్రహించాను. అందుకే మనభావాలన్నీ ప్రధానంగా ప్రణయోన్ముఖంగానో, ప్రగతిపరంగానో, ప్రణవాత్మంగానో ప్రకటితమవుతున్నవి. అయితే ఈ త్రివిధాలోచనలూ, త్రిముఖాను భూతులూ పరస్పర సామరస్య సమన్వయం కలిగి ఉన్నప్పుడే సమగ్ర జీవితానందం సాధ్యమవుతుంది. ఆ సరస సమన్వయ సాధనమే సాహిత్యం— ముఖ్యంగా కవిత్వం అని నా విశ్వాసం... ఈ దృష్టితో నేను నా కవితలను అందులోనూ గేయకవితలను మూడు భాగాలుగా విభజించి ప్రచురించాలని తలపెట్టాను" అంటూ నాఆత్మనాదం వినిపించాను.

"శ్రీకారశిఖరం" ప్రణవాత్మకమైన అద్వైత భక్తిభావబంధురగీతికాసంపుటి అయితే ఈ "నాదేశం నవ్యతగాంది" ఆర్థిక సామాజిక ప్రగతిప్రబోధాత్మక కవితాత్మ. దీనితోపాటే ప్రచురితమవుతున్న మరో గేయకావ్య సంపుటి 'ప్రేమారామం'. అందులో శృంగారభావపరమైన ప్రణయదర్శనం రసోద్దీపితమైంది. అన్నిటిలో ఆవిష్కృతమయ్యేది అనంతజీవచైతన్యమే — అఖండభావచైతన్యమే. శారీరక, మానసిక, ఆధ్యాత్మిక సుఖశాంతులకోసమే మానవజీవితం అన్వేషిస్తూ ఉంటుంది. నాదృష్టిలో ఇవి పరస్పర విరుద్ధాలు కావుకదా, పరస్పరదోహదాలుకూడా. భారతజాతీయపతాకను అలరిస్తూ జాతి ఆశయాలను ప్రతిబింబించే త్రివర్ణాల వలెనే ఈ త్రివిధ భావధారల పరస్పర సమన్వయ శక్తియే సిసలైన మానవాభ్యుదయహేతువు.

కనిపించని దైవము ఉన్నాడని నమ్మినా నమ్మకపోయినా మానవులు పరస్పర ప్రేమభావంతో సమతాభావంతో సుఖమయ జీవితం గడపాలి — అనే మౌలికాదర్శాన్ని, సిద్ధాంతాన్ని ఎవరూ కాదనలేరు. అలాగే స్త్రీ పురుష ప్రేమము మానవుని సామాజిక రాజకీయ ఆర్థిక జీవితానికి, ఆధ్యాత్మిక చింతనకు అవరోధాలుకావు— కాకూడదు. భౌతిక సంపదల పెంపుదలకు, సామాజికాభివృద్ధికి అవలంబించే ఏ మార్గమైనా ఏ సిద్ధాంతమైనా మనిషిలో ప్రకృతిసహజంగా ప్రజ్వరిలించే ప్రణయతత్వానికి, ప్రణవచింతనకూ భంగం కలిగించకూడదు. సమతా సౌభాగ్య సమాజవేదికమీద సరస సౌందర్య ప్రణయానుభూతికోసం ఆరాటపడే మానవ జీవితం అనంతసృష్టి రహస్య దర్శనాకాంక్ష వీడనవసరంలేదు.

యోగ ప్రయోగాలు, అంతర్ బహిః ప్రకృతులు, ఆత్మగత ప్రజ్ఞాన పదార్థగతవిజ్ఞానాలు అన్వేషించే—దర్శించే— అనుభవించే మూలసత్యం ఒకటే. అందుకే మానవుని ఆర్థిక సామాజికజీవితం, శృంగారజీవితం, ఆధ్యాత్మికజీవితం ఎలా పరస్పర సమన్వయ సూత్రబద్ధాలో నిర్వచించి నిరూపించే సమతా సత్య ధర్మ ప్రతిపాదనమే సాహిత్యప్రయోజనం అని అంగీకరించక తప్పదు. భావసత్యావిష్కరణమే భౌతిక సత్యాధారమై మనిషి విశ్వాసాలనూ విలువలనూ మార్చివేస్తూ మానవజీవితగతిని నిర్దేశిస్తున్నది. అనంతసత్యగర్భితమైన చరాచర, దృష్టాదృష్టు సృష్టిలో ఏసత్యాలు ఆవిష్కరిస్తే, ఏ భావాలు కల్పిస్తే సుఖానంద సుందర మానవజీవితానికి

దోహదకారులౌతాయో అట్టిపరిణామ ప్రగతిశీల భావోద్దీపనం చేయాలి సాహిత్య దర్శకులు. ఏతత్ భావభౌతికవాదమే నా సాహిత్యవాదమై ఈకృతుల్లో శ్రుతిస్తున్నది. సమ్యక్ సమగ్ర సమైక్యానందాన్ని ప్రసాదించే ఈ నూతన సాహిత్య మార్గమే భావితరాలకు శ్రీరామరక్షగా, భౌతికాధ్యాత్మిక అద్వైతజ్ఞానభిక్షగా నేను భావిస్తున్నాను. ఈ "నాదేశం నవ్వుతూంది" సత్యసాహిత్యరసోద్దీప్తమైన సామాజిక ప్రగతి ప్రబోధాన్ని పాఠకలోకానికి అందించగలదు అని ఆశిస్తున్నాను. సంకుచిత, శృంఖలిత వినాదాత్మక వలయంలో చిక్కుకుంటున్న నేటి సాహిత్యవిహంగానికి ఈ త్రిముఖాత్మకమైన అనంతస్వచ్ఛసేచ్ఛానాదరోదసి ఆనందపక్షాలందించుగాక! శక్తి, రక్తి, భక్తి కాంతిధారలు చిమ్మే భావజ్యోతులకు ఏకైక సుందర శుభంకర సత్యసాగరమే అఖండతైలధారయౌగాక!

ఈ "నాదేశం నవ్వుతూంది" లో నేను ఇంతవరకు వ్రాసిన ముద్రితాముద్రిత దేశాభ్యుదయగీతులు, మానవసమాజజీవితానుభూతులు ఇంచుమించు అన్నీ కూర్చి చేర్చబడ్డాయి. సంగీత సాహిత్య వేత్తలయిన పాలగుమ్మి విశ్వనాథం, ఎం. చిత్తరంజన్ వంటి నాదోపాసకుల ఆధ్వర్యంలో ఆకాశవాణిలో అనేకానేక గాయనీ గాయకుల కలకంఠాలు ఆలపించిన గీతాలు కూడా ఇందులో ఉన్నాయి. ఈ గేయసంపుటి లలితసంగీతపుటౌన్నత్యానికి దోహదం చేస్తుందని ఆశిస్తున్నాను.

ఈ పుస్తకాన్ని అత్యంత సహృదయతతో ప్రచురిస్తున్న చేతనసాహితీ సాంస్కృతిక సంస్థ, గుంటూరు వారికి హృదయపూర్వక కృతజ్ఞతలు. సాహిత్య సేవయే ఊపిరిగా చైతన్యయాత్ర సాగిస్తున్న ఈ సంస్థవారు ముఖ్యంగా సంస్థ అధ్యక్షులు శ్రీ అన్నపురెడ్డి విజయభాస్కరరెడ్డి గారు నా పట్ల, నా సాహితీకృషిపట్ల చూపిన ఆదరాభిమానాలకు అక్షరరూపమే ఈ గ్రంథం. వారి కళాతృష్ణాకృష్ణాతరంగిణి అనేకానేక అభ్యుదయ భావకేదారాలను లాలించి సకలానంద సస్యాలు పండించాలని ఆశిస్తున్నాను.

నా నిరంతర సాహిత్యయాత్రలో మార్గదర్శకులై, హితులై, స్నేహితులై నన్ను ప్రోత్సహిస్తున్న ఆత్మీయులందరికీ ఈ సందర్భంలో కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను. అగణిత ఆప్తమిత్రులు ఎవరికివారే నాకు ఆరాధనీయులు. అయితే ఆచార్య సి. నారాయణరెడ్డి, డా. దాశరథి, డా. బోయి భీమన్న, ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం, ఆచార్య తూమాటి దొణప్ప, డా. కనారిగ్ బోయాడ్జియాన్ (Dr. Knarig Boyadjian-U. S. A),డా. కరుణశ్రీ, డా. ప్రసాదరాయకులపతి, డా. అమరేంద్ర; సాహిత్యకులపతులు శ్రీ దేవులపల్లి రామానుజరావు, డా. కృష్ణశ్రీనివాస్ (Dr. Krishna Srinivas-Madras), శ్రీ P. రమణయ్యరాజా వంటి తేజోమూర్తులు తత్సుహృత్కోటికి ప్రతినిధులుగా పేర్కొంటున్నాను.

నా "శ్రీకర శిఖరం" గేయసంపుటి' క్యాసెట్టు 1985 ఉత్తర అమెరికా తెలుగుమహాసభల్లో విడుదలచేయటానికి, ఆ తెలుగుసాంస్కృతికాభ్యుదయోత్సవాలలో పాల్గొనే భాగ్యం కలిగించిన అక్కడి మిత్రులకు - ముఖ్యంగా డా. రాఘవేంద్ర S. ప్రసాద్, శ్రీమతి & శ్రీ N. R. మాచిరాజు, శ్రీమతి & Dr. రఘురాం వొల్లాల, శ్రీమతి & Prof. T. వెంకటేశ్వర్లు, శ్రీమతి & శ్రీ M. దేవేంద్రరెడ్డి, శ్రీ K. పురుషోత్తమనాయుడు, Dr. K. సురేంద్రనాథరెడ్డి గారలకు నా వినయపూర్వక కృతజ్ఞతలు. ఆ సందర్భంలో నాకెంతో అభిమానంతో తోడ్పడిన సుప్రసిద్ధ సంగీతకళాతపస్వి శ్రీ సాలూరు రాజేశ్వరరావు, గానకళాకోవిదులు శ్రీ S. P. బాలసుబ్రహ్మణ్యం, సృజనాత్మకకళాశీలి బహుముఖప్రజ్ఞాశాలి శ్రీ దాసరినారాయణరావు, సాహిత్యసేవాతత్పరుడు రసమయుడు శ్రీ M. K. రాము గారలను స్మరించకుండా ఉండలేను. నా నిర్విరామ కవితాయాత్రలో చెరిగిపోని చిరునవ్వులు దారిబత్తెముగా అందిస్తున్న నాహృదయేశ్వరి రాజేశ్వరికి నా అభినందనాలు.

ఈ గ్రంథముద్రణలో నాకూ, చేతన సాహితీ సాంస్కృతిక సంస్థవారికీ సర్వవిధాల సహకరించిన సాహిత్యాభిమానులందరికీ ముఖ్యంగా సర్వశ్రీ A. బ్రహ్మానందరెడ్డి, V. సంపత్కుమారాచార్యులు, K. కోటేశ్వరరావు, P. లక్ష్మీనారాయణరెడ్డి ప్రభృతులకు నాహార్దికధన్యవాదాలు. పుస్తకాన్ని ముద్దుగా ముద్రించిన "డాన్‌బోస్కో టెక్నికల్ స్కూల్ ప్రింటింగ్ ప్రెస్" వారికీ, ముచ్చటైన ముఖచిత్రం తీర్చిన శ్రీ బాలీ గారికీ నా ప్రశంసాపూర్వక కృతజ్ఞతలు.

ఈ పుస్తక ప్రచురణకు సముచితమైన ఆర్థికసహాయం అందించి నన్ను ప్రోత్సహించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారికీ, గౌరవనీయ ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారక రామారావుగారికీ నా ప్రత్యేకకృతజ్ఞతలు.

ఇక ఈ పుస్తకం అంకితాన్ని గురించి ఒకమాట. ఈ మధ్య నేను నా పుస్తకాలు విదేశాలలో భారతీయసంస్కృతికి వెలుగుబావుటాలుగా దీపించే తెలుగు వారందరికీ మహాసభలముఖంగా అంకితంచేసే అదృష్టం కలిగింది. అయితే ఈ పుస్తకం నా చిరకాలఆప్తమిత్రులూ సాహిత్యద్రష్టలూ మానవకల్యాణభావస్రష్టలూ అయిన ఆచార్య కళాప్రపూర్ణ సి. నారాయణరెడ్డిగారికి అంకితం చేస్తున్నాను.

డా॥ నారాయణరెడ్డిగారు గత నాలుగు దశాబ్దాలుగా తెలుగుసాహిత్యక్షేత్రంలో ప్రయోగాత్మక ప్రయోజనాత్మక అమృతభావోద్యానాలు నాటిన మేటి. మధ్యతరగతి రైతుకుటుంబంలో పుట్టి ఉత్తమోత్తమకవికుటుంబవృక్షంమీద మానవాభ్యుదయానికి మార్పుకోయిలయై రసార్ద్ర భావ సత్యగీతిక లాలపిస్తున్నారు. ఆయనతో స్నేహం ఒక తీరని దాహం. నేను హైస్కూలులో చదువుకుంటున్నపుడు (1952లో) నన్ను చూచీచూడగానే నాలో నిద్రాణమైయున్న చైతన్యరేఖలను ప్రబుద్ధం చేసిన నవకవితా ప్రభాకరు డాయన. తెలంగాణా రచయితల సంఘంలో నాకు సముచిత పాత్రకల్పించి నాటికీ నేటికీ నా కవితాయాత్రలో ప్రేరణ కల్పిస్తున్న ప్రతిభాపక్షపాతి-ప్రగతి భావోద్దీపకు డాయన. సృజనాత్మక సాహిత్యోద్యమకర్తగా తెలుగుభాషా సాహిత్య సంస్కృతులకు విశ్వవేదిక కల్పించిన విజ్ఞాన ప్రజ్ఞానమూర్తులలో గణనీయుడు ఆయన. అట్టి సాహిత్యమూర్తికి స్వచ్ఛందస్వేచ్ఛావిద్యాకులపతికి మనదేశమాత వదన సదనంలో ఆనందహాసదీపాలు వెలిగించే దేశభక్త ప్రజాభ్యుదయ వైతాళికునకు "నాదేశం నవ్వుతూంది" అనే యీ గేయసంపుటిని సార్థకంగా అంకితమిస్తున్నందులకు ఆనందిస్తున్నాను. కృతిని స్వీకరిస్తున్న ఆయన సహృదయతకు కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను. ఈ సాహితీబాంధవ్యము సమాజకల్యాణబాంధవ్యమై సత్యసాహిత్య సరసోద్యానోద్దీపనగంధమై వర్ధిల్లాలని ఆశిస్తున్నాను.

"నాదేశం నవ్వుతూంది" అంటూ మానవ ప్రగతి పట్ల ప్రగాఢవిశ్వాసంతో పాడుకుంటూన్న ఈ బృందగానంలో ఆబాలగోపాలం గొంతులు కలపాలని ఆకాంక్షిస్తున్నాను.

# ఇందులో

# నా దేశం నవ్వుతూంది

నా దేశం నవ్వుతూంది
నందనవనంలా
నా దేశం నవ్వుతూంది
నాదస్వరంలా___

మార్పు రథం తోలుకుంటు
మధుగీతం పాడుకుంటు
కారు చీకటులను దున్ని
కాంతిని పండించుకుంటు
నా దేశం నవ్వుతూంది
నందనవనంలా........

వాదాలకు పోని ప్రగతి
వాదం వేదం కాగా
భావి భాగ్యముల పాటకు
పల్లెలు పల్లవి కాగా
నా దేశం నవ్వుతూంది
నాదస్వరంలా........

హిమగిరి శిఖరాల ఎత్తు
హిందూసాగరపు లోతు
అందరి ఆశయాలకు
ఆదర్శం అవుతుంటే
నా దేశం నవ్వుతూంది
నందనవనంలా........

# కంటకాల నెదిరించే

కంటకాల నెదిరించే
కథ చెపుతూంది గులాబి
మంటలనార్పే గాన
మధువు చిందుతూంది మావి—

శైశిర పాశవ శక్తుల
చెండాడేటట్లుగా
చేయును గీతాబోధ
కోకిల వేదాంతి—

చైత్రయాత్ర సాగించే
జనశక్తికి జై జై అని
చెట్టుచెట్టు పై చైత్రం
పట్టె మార్పు జండాలు—

దోపిడీలు దుండగాలు
పాపాలిక తగ్గునని
పంచాంగం పఠించేను
ప్రగతివాద పక్షులు

చేదు తీపి కలిపిపాడు
శివకోకిల మీ ఉగాది
సమతా నవతానంద
సరస జీవన వినోది—

# వన్నె వన్నెల పూలతోట

వన్నె వన్నెల పూలతోట
మన్ను మిన్నుల కలుపుబాట
భరతదేశం భారతీయుల
తరతరాల వరాలమూట___

పౌరుషం కాశ్మీర గిరుల
తుషారమందు కృశానువయ్యే
చేతనం కన్యాకుమారిని
సింధు భంగములందు పొంగెను___

యుగ యుగాల చరిత్ర సారం
ఒలుక బోసెడి గాంగనీరం
హితములెన్నో మతములెన్నో
శ్రుతులు పాడే కృష్ణతీరం___

ఐకమత్యం ఆయుధంగా
అసురులను దుష్టులను ద్రుంచి
రామలక్ష్మణ పాండవేయులు
ప్రేమ నేలిన ధర్మభూమి___

చల్ల చల్లని మంచుమలకు
చల్లని మహాంబుధికి మధ్య
వెచ్చదనములు, పచ్చదనములు
విరిసినట్టి విశాలభూమి___

# కోకిల పాటలు

కోకిల పాటలు వినే
కోరిక లేదు
తారల ఆటలు కనే
తీరిక లేదు___

ప్రగతి నోట మనిషి గెలుపు
పాట వినాలి
బడుగు బ్రతుకులందు, సిరుల
బాట కనాలి___

తరులమీది విరుల జూచి
మురియజాలను
శ్రమజీవుల కనుల తనివి
సరులు కనాలి___

సైకతాల విహారాల
శాంతి కలుగదు
సమసమాజ జీవితాల
సౌరు కనాలి___

తలిరు గాడుపుల నా మది
పులకరించదు
సకల జనుల సుఖ తరంగ
శ్రుతులు వినాలి___

# ఏమి సంక్రాంతి!

ఏమి సంక్రాంతి !
ఇదెంతటి
హేమవిక్రాంతి!
ఏటి కాలువ నీటి ముగ్గులు
బీటభూముల ఎవరు వేసిరి
మావిగున్నల మోములకు
మంచిగంధం ఎవరు పూసిరి—

నింగి ముంగిట గంగిరెద్దై
ఆడినవి రాకెట్టులు
ఆపిలులు ఇన్సాటుల
అనుపమోపగ్రహములు
ఏమి పర్వమిది
భారతి కెంత గర్వ మిది—

కడలి ఒడలిని తైల ధారల
కడిగి దీపం ఎవరు పట్టిరి
పంట కుప్పలు ఫ్యాక్టరీలు
గొబ్బిళులుగా ఎవరు పెట్టిరి
ఏ విలాస మిది
ఎవ్వరి విజయహాస మిది—

మురికివాడల ఇరుకుసందుల
గరికపూల బ్రతుకు బాలలు
పెద్దలోగిలి పెరటితోటలు
ముద్దబంతుల ముద్దుబాలలు
కలసి సమతా భాగ్య కమలపు
కనుల వెలిగేరా
చీకటి
తెరలు తొలిగేనా!

# పనివాళ్లం పనివాళ్లం

పనివాళ్లం పనివాళ్లం
పాలమూరు పనివాళ్లం
ప్రాజెక్టులు నిర్మించే
పాలమూరు పనివాళ్లం___

నాగార్జున సాగరాలు
నాంగల్లు బాక్రాలు
కట్టినట్టి నదుల కిండ్లు
కట్టినట్టి కార్మికులం___

పోచంపాడుకు జీవం
పోసేటి శ్రామికులం
సీలేరున విద్యుత్తులు
తీసేటి భగీరథులం___

నాడు రాజులకు కోటలు
నేడు బతుకులకు బాటలు
నిర్మించిన పనివాళ్లం
ప్రగతికి పునాదిరాళ్లం___

పాలమూరులో పుట్టి
భరతఖండమెల్ల చుట్టి
కార్యదీక్షలో మెట్టి
కనుమూసే కూలీలం___

# వెలుతురు కోసం

వెలుతురు కోసం వెదికే
వెర్రి చీకటి
నీ కనురెప్పల క్రిందే
దీప మున్నదే!

కళ్ళు మూసుకొని
ఎందుకు
కాంతికై తపిస్తావు
కాళ్ళు కట్టివేసుకొని
కదలలే నంటావు!

భయం అనే బడిలోన
బానిసత్వ భాషలోన
కష్టాలే చదివి చదివి
దృష్టి కోలుపోయావా?

ఆకలికి ఓర్వలేక
హక్కుల దివ్వెలు మ్రింగి
బ్రతుకే కనిపించదని
బాధపడే కబోదీ!

# మనదేశం మారింది

మనదేశం మారింది
మారిందీ
ప్రగతినౌక గమ్యం
దరి చేరింది - చేరిందీ—

బక్కరైతు కూలీలను
బంజరుభూములు వలచె
పేదవడిన సీమల్లో
పరిశ్రమలు ప్రభవించె—

శ్రీదేవికి ప్రియమయ్యెను
పేదవారి లోగిళ్ళు
వాగ్దేవికి నెలవయ్యెను
నోరులేని పల్లెటూళ్ళు—

కడలిలోన పడిపోయే
గతిమాలిన నదులన్నీ
ఆకొన్న పొలాలు చేరి
అమృతం పండిస్తున్నవి—

ప్రగతి ప్రణాళికలు వేసి
ప్రజలను పాలకులు చేసి
దేశలక్ష్మి ఇంటింటికి
దీపంగా వెలిగింది—

# కాళరాత్రి

కాళరాత్రి నన్ను చూచి
కడలి కెవ్వుమన్నది
తన స్వేచ్ఛకు అడ్డుతగులు
తటము నేనె అనుకొన్నది!

చెలిమికోరి నే పోతే
చెలియలిక ట్టనుకొన్నది
అభయమీయ నే పోతే
అదరిబెదరి పోయినది!

ఆకాశము వంక జూచి
ఏకాంతములోన జడిసి
ఓ జలధీ, జలధీ! అని
హోరున పిలిచిన గానీ
కాళరాత్రి నన్ను జూచి
కడలి కెవ్వు మన్నది!

నింగేమొ నన్ను చూచి
పొంగి పారి పోతుంటే
కడలేమొ నన్నుచూచి
కలవరపడి పోతుంటే
ఏదారీ కనిపించక
లోదారిని పోవుచుంటి

# ప్రేమించబడుట కన్నా

ప్రేమించబడుట కన్నా
ప్రేమించుటయే మిన్న
భోగలాలసత కన్నా
త్యాగశీలతయె మిన్న!

ఇచ్చికొనుటలోని కలిమి
పుచ్చుకొనుటలో లేదు
పుచ్చుకొన్నదైన తిరిగి
ఇచ్చు కొనుటయే చెలిమి!

ఆట పాటలన్ని ఆపి
ఆత్మార్పణ చేయు మబ్బు
ఆకు, పూవు, పండు రాల్చి
ఆనందించును మ్రాను!

చిక్కని చీకటి గుడిలో
చుక్కలు దివ్వెలు పట్టును
శూన్యపువాకిటి బడిలో
సూర్యుడు పాఠాలుచెప్పు!

మనిషి కొరకు భూగోళం
మతి పోగొట్టుక తిరుగును
తన కొరకే తాను మనుట
మనుగడ కాదని తెలుపుచు!

నాదేశం

# రామాయణము

రామాయణమునకు బదులు
వ్రాసితిని మనుజాయణం!

వాల్మీకివలె నేను
వనవీథిలో పుట్టి
వేదనా వేదగిరి
వేములూరున మెట్టి
రామాయణమునకు బదులు
వ్రాసితిని మనుజాయణం....

ఎవరొ నన్నడిగిన
ఏకైక ప్రశ్నకు
బదులు చెప్పగ లేక
బాధ కవినై పోయి
రామాయణమునకు బదులు
వ్రాసితి మనుజాయణం....

మాయ వేషాలతో
మమతనే చెరబట్టి
మనిషియే రక్కసిగ
మారె నెందుల కని
రామాయణమునకు బదులు
వ్రాసితిని మనుజాయణం....

అధికారమున్నదని
అర్భకుల అబలలను
అడవిలో అగ్నిలో
పడద్రోసినందుకు
రామాయణమునకు బదులు
వ్రాసితిని మనుజాయణం

# ఎదలోన భావాలు

ఎదలోన భావాలు కదలాడుతాయి
కౌగితము రమ్మంటే కనులు మూస్తాయి...

నే నిదుర పోగానె
నిదుర లేస్తాయి
లేచి నే కలమూన లేచిపోతాయి
ఎదురేగి పిలువగా
బెదరి పోతాయి
తీరనప్పుడు వచ్చి కూరుచుంటాయి ....

గొంతెత్తి పాడుమన
గుస గుసలు పెట్టు
గుస గుసలు ఆడుమన
బుసబుసలుకొట్టు ....

అందాలు చూస్తుంటె
అగ్గి మాటాడు
ఆకలికి కేకలిడగా జోలపాడు
వాటి ఇష్టమె నా మాటలే వినవు
వాటి మాటలు విని
వ్రాతు కవితలను.

# భూదేవి పిలిచింది

భూదేవి పిలిచింది
పేదోళ్ళను
శ్రీదేవి వలచింది
లేనోళ్ళను —

శ్రామికుల చెరబట్టి
చంపుకొని తిన్నట్టి
వెట్టిచాకిరి, చెదలు
పట్టిపోతున్నది!

అప్పు నిప్పంటిన
ఆకలి బ్రతుకుల్లో
అభ్యుదయము కురిసె
ఆనందము విరిసె!

పనిచేయు కూలీలె
ఫ్యాక్టరీ దాతలు
హలము పట్టేవాడె
పొలానికి యజమాని!

కొండ కోనల్లోన
క్రొత్తవెలుతురు పాడె
చేతనము నడిపించ
జాతి-రథమై సాగె!

# కుహూ కుహూ మని కూసే

కుహూ కుహూ మని కూసే
కోకిల ఏమంటున్నది ?
ముద్దుల సంసారానికి
ఇద్దరేను పిల్లలట- కుహూ-కుహూ

ఝుమ్మని ఝుమ్మని పాడే
తుమ్మెదలే మంటున్నవి ?
ప్రణయదంపతుల కడుపు
పంట ఇద్దరేనంట - ఝుం - ఝుం

మిల మిల గగనంలోన
మెరయు తార లేమన్నవి ?
చల్లనౌ కుటుంబానికి
సంతానం ఇద్దరట - మిల - మిల

చక చక తిరిగేటి కాల
చక్రం ఏమంటున్నది
తల్లి ధరణి కనుల వెల్గు
తనయులు రవి చంద్రులట - చక - చక

# మమత మనసు

మమత మనసు పందిరిపై
కవిత పూలు పూచె
బాపురే! అనంత భావ
పరిమళాలు వీచె !

మాట మాట కలిసి, వెలుగు
బాట మీద సాగె
ఊహలలో వాస్తవాలు
ఉయ్యాలలు ఊగె !

జన జీవనముల హసించె
అనుభూతుల ఆమని
నవతాంబరముల రణించె
యువతా సౌదామని !

మనిషిని దీవించె ప్రకృతి
మమతా మంటపమున
ప్రగతిని పూజించె మనిషి
సమతా మందిరమున !

# తెలుగంటే వెలుగురా

తెలుగంటే వెలుగురా
వెలుగంటే తెలుగురా
తెలుగు వెలుగు దూర దూర
తీరాలను వెలిగెనురా !

వెలుగువోలె వినువీథుల
వెడలుటయే తెలుగురా
చెలిమి వోలె ఎద ఎదలో
మెలగుటయే తెలుగురా !

మంచి మనసు మాట్లాడే
మాటే మన తెలుగని
మంచి మనిషి అనుటకే
మరోపేరు తెలుగని
నిరూపించుకున్నపుడే
నీ దేశం తెలుగురా
నీ భాష వెలుగురా !

భాషలన్నిటికి తెలుగు
భాష ఆత్మబంధువని
సంస్కృతులన్నిటికి తెలుగు
సంస్కృతి రససింధువని
చాటుటయే తెలుగురా
సమదృష్టియె వెలుగురా !!

# బాటసారి ఎవరో

బాటసారి ఎవరో
వేటకాడు ఎవరో
గుర్తించని పక్షులు
గురియయ్యే తుపాకికి___

కొలనులతో ఆటాడే
కొమ్మలతో మాటాడే
పక్షుల కేమెరుక మనిషి
రాక్షసికూడా అని___

ముద్దుమాటలేకాని
మోసపుబాసలు రాని
విహగాలకు తెలియదుగా
వింతమానవుల తత్వం.

నింగికి నేలకు మధ్య
నెయ్యము నెరపే పక్షులు
నరుడే దేవుడని నమ్మి
నాశనమైపోతున్నవి___

మనిషిచేత పక్షిచావు
మన రామాయణ మాయె
మనిషిచేత మనిషిచావు
మనుజాయణ మవుతున్నది___

# ఎన్ని అనుభవాలైనా

ఎన్ని అనుభవాలైనా
ఎన్ని జ్ఞాపకాలైనా
శలభములై కాలిపోవు
చిత్రమైన మరపులో—

నిన్నను దిగమింగుతున్న
నేడే నా మరపు
నేడును నిన్నగ చేసే
రేపే నా మరపు—

ఆకాశం పండించే
అనుభూతులు అన్ని
మరపు కడలిలో కూలి
మాయమౌను ప్రతిరోజూ—

మరపే మనుగడ మనిషికి
మరపే ప్రాణం సృష్టికి
మరపే మనిషిని మరచిన
మనిషే మరపై పోవును—

# చక్కనైన శకుంతలకు

చక్కనైన శకుంతలకు
ఒక్కడే కుమారుడు
ఈ దేశం
తనపేరుననే వెల్గిన వీరుడు....

ప్రేమలెన్నొ పుష్పించి
నోములెన్నొ ఫలించి
పుణ్యదంపతుల కడుపున
పుట్టినట్టి సోముడు ....

ఇంతనాడె పులులబట్టి
ఈడ్చిన భుజబలుడు
వెన్నతోనే విద్యలరుచి
గన్న బుద్ధిబలుడు ....

కన్నవారికేమొ కీర్తి
కలిగించిన ఘనుడు
సుఖముగ తా బ్రతికి ప్రజల
సుఖపెట్టిన అనఘుడు ....

తల్లికి ఒకరో ఇద్దరొ
పిల్లలే వరాలు
భారతీయు లందరపుడు
భరతుని రూపాలు ...

# శక్తిపరుని యముణ్ని

శక్తిపరుని యముణ్ని
యుక్తితోడ గెలిచినట్టి
సావిత్రే నా అనంత
సత్యవ్రతరా !

దుష్టశతక దుర్యోధను
వ్యష్టిగానె ఎదిరించిన
ద్రౌపదియే నాజీవిత
ధర్మరాజ్ఞిరా!

విలాసేంద్రు వంచనకు
శిలాశిక్ష భరించిన
సతి అహల్యయే నా
సద్గతి గౌతమిరా!

జితేంద్రియుల ఓడించిన
శృంగార రసనందిని
మేనకయే నాభావన
విశ్వమిత్రరా!

ఆజన్మాంతము కష్టా
లే జతగా బ్రతికిన
రామసీతయే నా హృదయా
రామ రామరా!

పరీక్షలో త్రిమూర్తులను
పసిపాపల చేసినటి

# ఓనమాలు దిద్దుతుంటె

ఓనమాలు దిద్దుతుంటె
ఒళ్ళు పులకరిస్తోంది
బాలశిక్ష పట్టుకుంటె
బ్రతుకు పరిమళిస్తోంది—

అక్షరాలలో ఎంతటి
అమృత మున్నదో!
చదువుకున్న వానికెంత
శక్తి ఉన్నదో
తెలుసుకొంటి, నను నేనే
తెలుసుకొంటిని—

చదువుతున్నకొలదీ
గుండె వెలుగుతున్నదీ
చదువుకొన్నకొలదీ
చూపు కలుగుతున్నదీ
శారదాంబ నా కిప్పుడు
తల్లియైనది
తల్లినిమించి చదువే
తల్లియైనది—

ఓరయ్యో! నాకు చదువు
యోగం లేదనుకొంటి
వయోజనునికే విద్య
వరమని నే తెలుసుకొంటి
చదువుకుంటె లేనిపోని
సంకటాలు లేవురా
రాత నేర్చుకుంటే
తలరాత మారిపోవురా!

# కోకిలా నాపాట

కోకిలా నాపాటకూడ వినిపించుకో !
నీ కంఠమే ఎంతదాక మ్రోగింతువే !

ఆకొండ ఆకోన ఆ అడవి విడనాడి
ఓ నిర్ఝరీ!
వేదనానేకగిరులున్న
నా గుండెలోకూడ సాగవా! మ్రోగవా!

ఈ కాళరాత్రినిండా కాంతులను నించు
శంపాలతా!
నా నిశాజీవితాంగణములో కూడ
ఆశాలతలు నింప రావా!

గగనమునుండి భూగర్భములో దూకు
ఓ నయాగరా జలపాతమా!
నా మనశ్చక్రముపై దూకి నాలోన
విజ్ఞానవిద్యుత్తు వెలిగింపరాదా!

నవ్యజీవనగీతి కామృతము కురిపించు
ప్రకృతి!
నీ విశ్వవీణా కలశ్రుతులలో
ననుకూడ శ్రుతిచేసికొని పాడుకొనవే!

# నాకు స్వేచ్ఛ కావాలి

నాకు స్వేచ్ఛ కావాలి
నాకు స్వేచ్ఛ కావాలి
మహాతపోనిధులారా!
మహాత్ములార! నేతలార!

లోకపు చెరసాలలోన
లోహబంధనాలలోన
బందీ మానవుడ నేను
బానిసల్లా ప్రథముణ్ని....

నా శక్తికి నా యుక్తికి
నా కంటికి నా బుద్ధికి
అడుగడుగున హిమనగాలు
అడ్డుతగిలి ఎదురు తన్ని
స్వేచ్ఛలేదు అని చెప్పే
స్వేచ్ఛతప్ప స్వేచ్ఛ లేదు....

చచ్చినవాళ్ళందరి నొక
సారివెళ్ళి చూసొస్తే
బాగుండును, కానీ, ఇటు
బాటలు కట్టేశారు....

నా బ్రతుకును నిర్ణయించ
నాకెహక్కు లేనప్పుడు
స్వేచ్ఛ ఉన్నదనుకొనడం
స్వీయ ఆత్మ వంచనం....

# చిత్రంగా ఉన్నదే

చిత్రంగా ఉన్నదే
చీకటి పోతున్నదే
ప్రజాశక్తి ప్రభ ఎంతో
ప్రచండంగ ఉన్నదే —

మట్టి మ్రాను రాయి రప్ప
మాటలాడుతున్నవి
తరతరాల దురంతాల
తరిమికొట్టుతున్నవి —

స్వార్థం మోసం కపటం
సంకటాన పడ్డవి
పిట్టకైన తెలియనట్టి
గుట్టు బయట పడ్డది —

ఉచ్చులన్ని త్రెంచుకొని
స్వేచ్ఛ ఆడుతున్నది
శ్రమశక్తికి నమామి అని
సమత పాడుతున్నది —

# పాటలన్నిట మేటి ఏది

పాటలన్నిట మేటి ఏది?
ప్రగతి పాట
ప్రగతి పాటకు పల్లవేది
పల్లెసీమ___

పాడరా ఒక ప్రగతి పాట
బ్రతుకు తోటలు పల్లవించ
పచ్చదనముల వెచ్చదనముల
పల్లె కోకిల పరవశించ -

అల్లుకో ఒక క్రొత్త రాగం
అఖిల లోకం పరిమళించ
క్రొత్తదనముల క్రొన్నదముల
గుండె మావులు గుస్తరించ -

పెంచు సమతా ప్రేమ భావం
పేదరికములు అంతరించ
అందములు ఆనందములతో
ఆమనికి కనువిందు సేయ -

# మనకు మనం

మనకు మనం పులుముకున్న
మలినంరా కులం
మనకు మనం చేసుకున్న
మోసంరా కులం -

గంగవంటి, నింగి వంటి
మనసంస్కృతి మనమతం
కులమను మాలిన్యంతో
క్రుళ్ళిపోయె, క్రుంగిపోయె -

మానవతకు మనమిచ్చిన
మహావిషం కులతత్వం
భరతభూమిలో పండిన
భ్రష్టత్వం కులతత్వం -

కులానికి విడాకులిచ్చి
ప్రేమను పెళ్లాడినట్టి
యువతీయువకులే, భావి
భారతనిర్మాతలు -

కులనిర్మూలనంచేసి
క్రొత్తసమాజం తీర్చి
వేదసంస్కృతిని, సమతా
వేదికపై నిలుపుదాం -

# ఈ దేశం మనదేశం

ఈ దేశం మనదేశం
ఎంత మారిపోయెరా
ప్రజలు కన్న కలలెన్నో
నిజాలు అయిపోయెరా!

చేతికందకుండ పరుగు
తీసే నదులెన్నో
ప్రేమతోడ నిలిచి బీడు
భూములు పండించెరా....

బండిబాట లేనిచోట
పడెను రైలుమార్గాలు
కాలిబాట లేనిచోట
కానబడెను రోడ్డులు....

చమురుదీపములు సైతం
సరిగా వెల్గని పల్లెలు
కంటికింపుగా వెల్గె
కరంటు దీపమాలలు....

దుక్కిదున్న మోటలాగు
బక్కెడ్ల మొరవినెనో
అవతరించె ట్రాక్టర్లూ
ఆయిలుఇంజన్లూ....

మనభారత సమాజాన
మధుమాసం వికసించె
మనశ్రేయోరాజ్యలక్ష్మి
మంగళగీతులు పాడెను....

# అత్యాచారాలేల

అత్యాచారాలేల
ఆడవారిపైనా
అహంభావమేలా నీ
అబలత్వము పైనా ?

అమ్మ తలపు, ఆలివలపు
అనుగుచెల్లి, తనయ పిలుపు
కనపడదా నీకు మగువ
కరుణామయ రూపంలో—

కొరడా విసిరినచో ఏ
కోకిల పాడునురా
నిప్పులు కురిపిస్తే, ఏ
నెమిలి ఆడునురా ?

ఒకసతి జోలికిపోయి
ఓడారు త్రిమూర్తులే
రావణు పని ఏమయ్యె
రమణిని అవమానించి ?

దేశకాలముల జీవన
దీపమురా శక్తి
శక్తిని సాధించుము, స్త్రీ
శక్తిని పూజించి—

# పాట వ్రాయిస్తాను

పాట వ్రాయిస్తాను
ప్రగతి చేత
పాడుకోవాలి నా
భరతజాతి -

పల్లెసీమల విరియు
సిరులు పల్లవిగా
పట్టణాల కురియు వెలుగు
అనుపల్లవిగా -

కష్టజీవుల కనుల
కలలన్నీ పండగా
మధుమాస సీమలో
మార్పు వనులు నిండగా -

పంటచేల నుతించు
పన్నీటి కాల్వలు
వీధి వీధి శ్రుతించు
విద్యుత్తు తీగలు -

యువత నవత కలిసి
సమత పీఠము వేయు
మమత మానవతా
మంత్రపఠనము చేయు -

# మరపు రాదు

మరపు రాదు మరవలేను
మళ్ళీజన్మలోనైనా
సిమ్లాలో నే పొందిన
అమ్లాన అనుభూతి....

వెన్నెల మధుపానంలో
మిన్నంటిన తెలికొండలు
గుండెలపై తేలియాడు
కొందురు వనకాంతలు....

ప్రేమికులను దీవించుచు
వేల్పులు చల్లెడి ముత్తెపు
కుప్పలవలె ఆసీమల
కురియు హిమపరాగము ....

చిరుగాలుల ప్రణయంలో
పరవశలై లాస్యమాడు
కోటి కోటి తరులతికలు
కుసుమ హస్తముద్రలతో ....

పూలతోడ విద్యుద్దీ
పాలతోడ పరిమళించు
కొండలు - కావవి ప్రకృతి
గుండియలే అనిపించు ....

యువదంపతులకు స్వర్గము
నవతకు పెట్టని దుర్గము
రాగముగల ప్రతిమనిషికి
రసలోకానికి మార్గము....

# వెలుగు పండే తెలుగుతీరం

వెలుగు పండే తెలుగుతీరంలో
విలయతిమిరం తాండవించింది
భరత భూదివి సీమవాటికలో
నరకమే దిగి రభస చేసింది—

జలధి వీచి తిమింగలాలు
ప్రళయ ఝంఝూ భుజంగాలు
కారు మబ్బుల దేగలు
కలిసి మ్రింగెను నిస్సహాయుల—

ఉదయ కిరణాలెంత ఊదిన
కదలలేని కళేబరాలు
విశ్వబాంధవుడెంత ఊపిన
వెలుగులేని విలోకనాలు—

తెలుగుగుండె గుభిల్లుమన్నది
దేశమెల్లా గొల్లుమన్నది
అఖిలలోకం సానుభూతి
అభయహస్తం పట్టుచున్నది—

మమత సమతా రూప శవములు
మౌనముగ మాట్లాడుచున్నవి
బ్రతికి మిగిలిన వారి బాధలు
బాపుటే మీ ధర్మమన్నవి—

(1977 దివి సీమలో పెను తుఫాను)

# మనపొలిమేరలు దాటి

మనపొలిమేరలు దాటి
మన శత్రువు రాలేడు
వచ్చాడా చచ్చాడే
బ్రతికి బయటపడలేడు....

మంచుమలలు కినిసి, అగ్గి
మంటలు కురిపిస్తాయి
గడ్డిపోచకూడ ఘనా
ఘనమై గర్జిస్తుంది....

నింగిని మన విమానాలు
నేలపైన శతఘ్నులు
జలధుల నౌకాబలాలు
జయనాట్యము చేస్తాయి....

ప్రతిభారతపౌరుడు
పౌరుషోగ్రవీరుడు
దేశ స్వాతంత్ర్యసము
దీపకరుడు - అజేయుడు....

దేశభక్తి త్యాగరక్తి
దృఢసమైక్యతాశక్తి
ప్రజలను నడిపించాలి....
ప్రగతిని వెలిగించాలి....

# వాసంత విశేషాలను

వాసంత విశేషాలను
వనరమ వర్ణిస్తున్నది
కుహూ కుహూమని కోకిల
ఊ కొడుతూ వింటున్నది....

ఓటుహక్కు కలవాళ్ళను
పోటి చేస్తున్నవాళ్ళు
ఎంతో కొనియాడుతున్న
వింతలు వర్ణిస్తున్నది....

చేసిందేమని అడిగితె
చేయబోవునది చెప్పే
నాయకులను గని ప్రజలు
నవ్వుట వర్ణిస్తున్నది....

కోటీశుడు కొనజాలని
ఓటు విలువ తెలిసికొని
గున్నమావు లటు పూచిన
గుండెల వర్ణిస్తున్నవి....

విరుల, గిరుల, ఝురుల వోలె
సిరులు విరిసి, వెలసి, పారు
శిశిరము లేనట్టి భావి
సీమలు వర్ణిస్తున్నది....

# రాకెట్లు ఎగసె

రాకెట్లు ఎగసెనోహో!
చీకట్లు పగిలెనోహో!
కనరాని కలల తావి
కనువిప్పె సత్య సుమమై—

కేలెత్తి పిలిచె కాలం
కేపు కెనడి లోన
శిరమెత్తి పలికె దేశం
శ్రీహరికోట లోన—

అందాల చందమామ
అందించె స్నేహహస్తం
భుజబలుని బుద్ధిబలము
పూరించె విజయభేరి—

శూన్యజలధిలోని
చుక్కల పడవల్లో
ఊహలలో ఊహలుగా
ఊగె వాస్తవాలు—

నేలమీది మనిషి
విసరినట్టి యంత్రం
నింగిమనిషి కోసం
వెదకు విసుగులేక—

# చీరెలు చీరెలు

చీరెలు చీరెలు
గద్వాలా చీరెలు
కట్టుకున్న వాళ్ళంతా
కదిలాడే తారలు—

రకరకాల రంగులు
రకరకాల కొంగులు
నేతగాళ్ళు కొనేవాళ్ళు
నవరసాంతరంగులు—

జరీయంచు చూడండి
ఖరీదెక్కు వనకండి
ఆ చీరెలు కట్టకున్న
ఆడజన్మ మెందుకండి—

సీతమ్మ పెళ్ళినాటి
పీతాంబర మిక్కడిదే
ఇంద్రుడు మెచ్చడు, అచ్చరలు
ఈ చీరలు కట్టనిదే—

ఈ చీరెల మహత్వం
ఇంతంతని కాదండి
కన్నెలు కట్టారంటె
కళ్యాణం తప్పదండి—

# గ్రంథాలయ మంటె

గ్రంథాలయ మంటె
భావ గంధాలయం
అక్షరాల వెలిగే
ఆనందాలయం—

ఆలోచించేవారికి
అమృతం గ్రంథాలు
ఏనాటికి విడిపోని
హితులే గ్రంథాలు—

రాతియుగంనుంచి మనల
రాకెట్టు యుగానికి
చేర్చినట్టి శతాంగాలు
చేతన గల పుస్తకాలు—

బుద్ధిబలం పెంచేవి
హృదయం కరగించేవి
భాషలన్నిటికి జీవం
పోసేవి గ్రంథాలే—

గ్రంథపఠనమాని మీరు
అంధులు కావద్దండి
గ్రంథాలయములు తరచి
అమృతాంధసులై పొండి

# సాగిపోయే ఏరు

సాగిపోయే ఏరు
ఆగి పోయింది
వట్టిపోయిన బీడు
పల్లవించింది—

కామందులను వీడి
కష్టజీవుల కూడి
పంట భూములు, పేద
ఇంటి కోడళ్లాయె—

భయపిశాచం ప్రజల
వదలిపోతూంది
త్రికరణాల స్వేచ్ఛ
వికసించుతూంది—

చేతిపనులు పట్టె
జాతిదీపాలు
పల్లెల్లో మేలుకొనె
ప్రగతిరూపాలు—

# ఏమౌతున్నది ఈదేశం

ఏమౌతున్నది ఈ దేశం
ఎటు పోతున్నది మనదేశం

చదువుకునే విద్యార్థుల
సమ్మెల్లోదించి
విద్యాలయ రసనలతో
విషాలు గ్రక్కించి
స్వార్థం ఆడే ఆట
సాగునెంత కాలం ?

ప్రగతిపథంలో దాగిన
పన్నగాల పన్నాగాల
పాపపు చదరంగంలో
పాచికలై పోతారో
ఎక్కే బస్సులు కాల్చి
ఎక్కడికి పోతారో ?

పల్లెల్లో ప్రాజెక్టులు
పట్టణాల ఫ్యాక్టరీలు
కట్టే యువశక్తి, కత్తి
కట్టిందా తల్లిపైన ?
మంటలార్పగల వారే
ఇంటిని తగలేస్తారా ?

నా దేశం

# ఆసేతుహిమాచలం

ఆసేతుహిమాచలం
ఆమనియే నేడు
అందరి డెందాలు పూల
పందిరులే నేడు....

వ్యక్తి వ్యక్తి కలసి, జాతి
శక్తియైన రోజు
ఆశయాలు ఆశలు, రా
జ్యాంగమైన రోజు....

కన్నీటిని తుడుచుకొని
పన్నీటిని తలచుకొని
పాటలు పాడాలి బ్రతుకు
బాటసారు లీనాడు....

సమతా స్వాతంత్ర్య ప్రజా
సామ్యవాద సుమవనాల
పరిమళాలు తప్ప నాగు
బాముల మాటేల నేడు....

కోటీశులు - కూలివారు
కువలయాలు-గడ్డిపూలు
ఈ వాసంతేందిర
లీలా విలాస రూపాలు....

# హరిజనుడు లేచాడు

హరిజనుడు లేచాడు
గిరిజనుడు లేచాడు
యువజనుడు లేచాడు
నవభారతంలో—

కులతత్వ తాటకి
కూలిపోతున్నది
మతకలహ మాయావి
మాయమౌతున్నది—

చేతనము ఇంటింటి
చైత్రమై విరిసింది
శ్రమశక్తియే, దేశ
భక్తియై నిలిచింది—

నట్టడవి కడుపులో
పుట్టినవి నగరాలు
పల్లెపల్లెను పూచె
పట్టణపు విభవాలు—

మనిషికి మనిషికి నడుమ
మండిపడిన వ్యవస్థ
కూలిపోయి, సమత్వ
కాలోదయమ్మాయె—

# ఏదారిని వస్తావో!

ఏదారిని వస్తావో - ఏదారిని పోతావో
ఎవరిని ప్రేమిస్తావో - ఎవరిని ద్వేషిస్తావో
ఊహింపగనైనలేమొ
ఓ అదృష్ట దైవతమా !

దారినిపోయే వారికి కోరి వరము లిస్తావు
నిన్నె నమ్ముకున్నవారి కున్నదూడిపిస్తావు
ఎంత నిరంకుశురాలవా !
ఎంత పంతముల రాణివా !

విజ్ఞానధనులచేత వెర్రిపనులు చేయింతువు
అజ్ఞానాంధులకుకూడ అధికారము లిప్పింతువు
నీ నియమ మెట్లోకాని
నీ న్యాయము లేమొకాని ....

ఊరక ఒక నిర్దోషిని ఉరికంబం ఎక్కింతువు
హంతకుడగువాని నొకని ఆదరించి రక్షింతువు
ఏది న్యాయమో నీకు!
ఏది ధ్యేయమో నీకు —

నా కష్టఫలము మాత్రము
నాకు దక్కనీయవమ్మ
నన్ను మింటికెత్తకున్న
నవ్వులపాలు చేయకమ్మ.

# మలయమారుతం

మలయమారుతం
మలయమారుతం
మలయాశాగత మైత్రీ
మధురమారుతం -

గోలంకొండ మంచుకొండ
గుండెలు పొంగారునట్టి
గోదావరి గంగా
తరంగ మారుతం - మలయమారుతం....

తెలుగునోట తెలుగువీట
వెలిగే భారతసంస్కృతి
మలయా భూవలయాత్మను
అలరించే మధుగీతం - మలయమారుతం....

డెందాలను శ్రుతిచేసిన
అందాలను జతచేసిన
హిందూ సింధువు పాడే
హిమవన్నగ సంగీతం - మలయ మారుతం....

మమతల మల్లియలు కూర్చి
కలల కలువపూలు తీర్చి
ఆనందాంజలి ఘటించు
మానవతా జలపాతం - మలయ మారుతం....

(1981 మలేషియాలో ప్రపంచ తెలుగు
మహాసభలలో వీచిన భావ వీచిక)

# తిట్టుటయే కవిత

తిట్టుటయే కవిత అయితే
మనదే నోబెల్ బహుమతి
కీచులాట క్రీడ అయితే
మనదే ఒలంపిక్ పతకం -

వంచనయే కళ అయితే
మించలేరు మన నెవ్వరు
ఆవేశమే బలమైతే
ఆపలేరు మన నెవ్వరు -

వాగ్దానమే దానమైతే
వరదులమే మనమంతా
ఊహలె ఉయ్యాలలైతే
ఉడుపథాలు మన సొంత -

స్తుతియే స్నేహితమైతే
తోబుట్టువులం అందరం
డంబమె డంబరమైతే
జంభారుల మందరమూ -

# పల్లవి దొరికిందని

పల్లవి దొరికిందని
పాట వ్రాసితే
పాటతోపాటు తుదకు
పల్లవి పోయే -

చోటు దొరికెనని ఒకడు
కోటకట్టితే
కోటతోపాటు బ్రతుకు
చోటుపోయెను -

పిల్ల దొరికెనని ఒకడు
పెండ్లియాడితే
పెండ్లితోపాటు వలచు
పిల్లపోయెను -

జుట్టు దొరికెనని ఒకరిని
కొట్టపోయితే
కట్టెతోపాటు, వాని
జుట్టుపోయెను -

# వదలుకొంటి ఒకటి ఒకటి

వదలుకొంటి ఒకటి ఒకటి
వ్యసనాలన్నీ
ఏముందిక వదలుటకై
ఈ లోకంలో -

మతితప్పిపోతుందని
మధుపానం వదలితి
మధుమేహం వస్తుందని
మధురరుచులు వదలితి -

చెడ్డపేరు వస్తుందని
శృంగారం మానితి
చట్టాలను గౌరవించి
సరదాలను మానితి -

రూకలకై గడ్డితినే
జాకీల మోసాలకు
గుండె పగులునని వదలితి
గుర్రపు పందాలను -

ఊపిరితిత్తులకోసం
పొగత్రాగుట మానితి
రక్తపోటునకు వెరచి
రాగద్వేషములు వదలితి
వదలుటకై ఏముందిక
ఈ లోకంలో -

# సంవత్సరమంతా

సంవత్సరమంతా
వాసంతమే శోభిస్తే
పికశుకసంగీతం
కర్ణకఠోరమౌనేమొ?

కోరినప్పుడల్లా
ఓకోమలి కౌగిలి లభిస్తే
ప్రణయ ప్రపంచంలో
పసయేమీ ఉండదేమో?

మరపు అనే గుణం మనిషి
మనసు నుండి తొలగిస్తే
చిరస్మృతులు ఆతణ్ని
చీల్చి కాల్చి వేయునేమో?

నారీ వస్తువును
రచనల్లో నిషేధిస్తే
రచయితలకు అసలు ఉప్పు
రాళ్లైనా పుట్టవేమో -

మరణ రోగానికి
పక్కా మందే కనిపెడితే
చావడం అనేది గడ్డు
సమస్య అవుతుందేమో!

# అలా అలా గలా గలా

అలా అలా గలా గలా, పాడేనదీ
ఐరోపా హృదయంలో ఆడేనదీ
కలవంటి కథవంటి రైనునదీ
కదలించె నా మదిలో కవితానదీ ....

ఆల్ప్సు పర్వతాల ఒంట పుట్టినదీ
అందమైన ప్రకృతిఇంట మెట్టినదీ
ముచ్చటైన పచ్చగౌను వేసినదీ
ముదిమిలేని కళారాణి రైనునదీ
కదలించె నా మదిలో కవితానదీ ....

స్నానము జెనీవా కొలనుల చేసినదీ
షాపింగు జర్మనీలో సల్పినదీ
పూలేమొ హాలెండున ముడిచినదీ
కడలి కౌగలింపు చేసు రైనునదీ
కదలించె నా మదిలో కవితానదీ ....

ఒయారంగ తనదారిని సాగినదీ
ఒహో! ఆహా! అంచు జనం చూచినదీ
చిరునవ్వుల సౌభాగ్యం చిందినదీ
చిరయశస్వి రసతపస్వి రైనునదీ
కదలించె నా మదిలో కవితానదీ ....

మనిషి మనిషి రక్తమెంత పీల్చినదీ
మతంపేర మానవతను చీల్చినదీ
దేశపటాలెన్నోసార్లు మార్చినదీ
చూచిన సాక్షీమతల్లి రైనునదీ
కదలించె నామదిలో కవితానదీ ....

# ఉన్నాడు ఉన్నాడు

ఉన్నాడు ఉన్నాడు బాపు
నిన్న, నేడు, రేపు ఉన్నాడు ....

నీలోన నాలోన
నిఖిలావనిలోన
శాంతికై క్రాంతికై
సాగు యాత్రలలోన
ఉన్నాడు ఉన్నాడు బాపు ....

జాతిభేదములేని
నీతివర్తనలలో
మతవిభేదములేని
హితబోధనములలో
ఉన్నాడు ఉన్నాడు బాపు ....

స్వార్థాల చెరబడిన
సత్యాల విడిపించ
సమరాల తడబడిన
శాంతిని నడిపించ
ఉన్నాడు ఉన్నాడు బాపు ....

బ్రతుకులో మనిషికి
వెతల మానవతకు
ఆరనివెలుగు చూపు
అమరదీపము-బాపు ....

# నీవే భరతావనివై

నీవే భరతావనివై
భరతావనియే నీవై
వెలిగే చాచా నెహ్రూ
వెలిగించుము యుగ యుగాలు —

ప్రాజెక్టులు ఫ్యాక్టరీలు
ప్రగతి మందిరాలంటివి
శ్రమజీవులె సమభావులె
సకల దేవతలు అంటివి —

పారతంత్ర్య మెచటనున్న
పారద్రోలవలె నంటివి
కులమతాలు ప్రగతి కడ్డు
గోడలు కావద్దంటివి —

నీ మేధస్సున భానుడు
నీ హృదయంలో సోముడు
పండించిన వెలుగు పంట
నిండెను నే డింటింట —

ఏ తోటను పూచిన నీ
ఎదయే మాగమ్యము
ఏ పాటలు పాడిన నీ
ఎలుగే కడు రమ్యము —

# ఒక్కటేరా తెలుగుదేశం

ఒక్కటేరా తెలుగుదేశం
ఒక్కటేరా తెలుగుభాష
ఎక్కడున్నా తెలుగులందరు
ఒక్కటేరా! ఒక్కటేరా!

ఒక్కటే గోదావరీనది
ఒక్కటే కృష్ణానదీ
రెండునదులూ తెలుగుజాతి
గుండెలో ఒక్కటైనవి ....

అరుకులోయల గాలికొండ
హైదరాబాదు గోలకొండ
కలిసికట్టెను తెలుగుతల్లి
కంఠసీమను పూలదండ ....

సాగరం ఒకవైపున, నిజాం
సాగరం ఒకవైపున
తెలుగుతల్లికి వీచు చల్లని
అలల వీవన లందమెప్పగ ....

ఎదలు ఎదలు కూర్చి కట్టిన
ఏకతా సేతువులమీద
కదలివచ్చెను ప్రగతి చక్రాల్
కనుల పండువగా ....

# ఐరోపా హృదయంలో

ఐరోపా హృదయంలో
* హైతాత్రా, లోతాత్రా
ఆమని విరిసిన సీమల
లో మన్మధుజైత్రయాత్ర —

సెలయేటి కలువ దండల
కళకళలాడే కొండల
వెచ్చదనం పచ్చదనం
వెదజల్లే వనకాంతల-చూశాను ....

మంచు దాడులకు జడిసి
మట్టిలోన దాగిపోయి
దినరాజు అభయమీయగ
పునరాగత సుమగంధము -గ్రోలాను ...

బ్రతుకుబాధ మరిపించే
రసడోలల ఊగించే
నర నారీ నట గీతము
నటనాలయ సంగీతం-విన్నాను ....

వన్నెలాడి కపోలాలు
వెన్నలాంటి కరతలాలు
లాస్యమాడు లేకొనులు
హాస్యమాడు చిరుగొనులు-తాకాను ....

మధుపాయి సుధాధరము
మధురపక్వ కిటిమాంసము
స్లేవోవిచ్ సురపానము
జీవన వాసంతం రుచిచూశాను ....

---

* చెకస్లోవేకియాలోని పర్వత ప్రదేశాలు

# అంత్యప్రాసలకోసం

అంత్యప్రాసలకోసం
అరచే అజీర్ణ కవిత
అనుభూతికి తావులేని
అక్షరాలమూట కవిత
కాదని, రసధునీ కవిత వ్రాస్తున్నాను -

గణంపోతె పోయెకాని
గుణంపోయినట్టి కవిత
కాళ్ళుపోతె పోయెగాని
కళ్ళు పోయినట్టి కవిత
కాదని, రసధునీ కవిత వ్రాస్తున్నాను -

భాషపోతె పోయెగాని
భావం పోయిన కవిత
జవంపోతె పోయెగాని
జీవం పోయిన కవిత
కాదని, రసధునీకవిత వ్రాస్తున్నాను -

కథపోతె పోయెగాని
కల్పన పోయిన కవిత
ఆలోచనపోతె పోయె
అర్థం పోయిన కవిత
కాదని, రసధునీ కవిత వ్రాస్తున్నాను -

# కోపెన్‌హేగన్ ప్రక్కన

కోపెన్‌హేగన్ ప్రక్కన
కూరుచున్న మర్‌మేడ్
సాగరతీరంమీది
మూగశిలాసుందరీ !

జలధి తరంగాలలో జలకమాడవచ్చి
అలల్లో కలలుకంటూ అలా ఉండి పోయావో
వలువలన్ని గట్టుమీద వదలివేసి సుడిగాలికి
ఎగిరి వలాహకము లైతె
ఇలా దిగంబర వైతివా !

కడలి మునుగు రాకుమారు
కాచినట్టి నినాన్నతడు
చేపట్టక పోవుటచే
సిగ్గుతోడ శిలవైతివా !

మనసు దోచుకొనిపోయిన
మనోహరుడు వచ్చుదాక
మోహనరాగ తపస్సున
మునిగి వేచియున్నావా !

కథలకు కమ్మనికలలకు
కళలలకు జీవము పోసెడి
మూర్తిగా చెరగిపోని
కీర్తిగా వెలసినావా !

# ఎంత గడుసరిమావి

ఎంత గడుసరిమావిగున్న
ఎండలను ఎదిరించె నన్నా! —

కోయిల గళాలతో
క్రొత్త పాటలు త్రాగి
రసకేతనము లెత్తి
రాగిల్లిపోయినది—

అంబుధుల గుండెలే
అవిసిపోతుంటేను
మంచుమల కండలే
మరిగిపోతుంటేను—

గాలి గజగజలాడి
పారిపోతుంటేను
చేర్చి తననీడలో
సేద దీర్చిన జాణ—

భయము లేకున్నచో
బాధలే లేవురా
చల్లని రసాల వని
సందేశ మిదిరా—

## కారుచీకటి క్రమ్ముకున్న

కారుచీకటి క్రమ్ముకున్న
తెలుగుభారతి జీవితములో
భానువై గురజాడ అప్పా
రాయ! వెలసితివి —

పుట్టుగానే పరిమళించిన
పూవువై సాహిత్య సుగతిని
నిత్యనూతన సౌరభాలు
నింపి పోయితివి—

దేశమంటే మట్టియనుకొని
మోసపోయిన భరతజాతికి
దేశమంటే మనుషులని, సం
దేశ మిచ్చితివి—

ఆడబిడ్డల అమ్ముకొన్న
సంఘమునకు బుద్ధిచెప్పగ
సృష్టి చేసితివయ్య "కన్యా
శుల్క" నాటకము—

వేషభాషలు మార్చి, మోసము
చేసి బ్రతికేస్వార్థపరు లు
న్నంతకాలము మరువగలమా
నీ గిరీశమును?

ప్రభువులకు ప్రాణమిత్రుడవై
ప్రజలకై ప్రాణమిచ్చితివి
లక్ష్మి కాదని నవ్య వాఙ్మయ
లక్ష్మి గొల్చితివి—

అచ్చమౌ జాతీయకవి నీ
వే యటంచు తెలుగుప్రజలు
పాడుకొందురు అఖిలమానవ
ప్రగతిగీతాలు—

# పల్లెటూళ్ళు పల్లవిగా

పల్లెటూళ్ళు పల్లవిగా
త్యాగం రసరాగంగా
పాట పాడరా
భారతీయుడా___

సామాన్యుడు భాషగా
సమతే భావంగా
బ్రతుకే సంగీతంగా
కృతులు పాడరా___

సుగుణాలు గణాలుగా
మమతలు మాత్రలుగా
ప్రగతియే పదాలుగా
కవిత అల్లరా___

దిక్కుల మండపములో
చుక్కల శ్రోతలు చేరి
పద పదమున తలలూపగ
పాట పాడరా
భారతీయుడా___

# ఓటమి నా కనునీడల

ఓటమి నాకనునీడల కోటలు దాటే కాలం
జగతి గోళమున గాలులు చలియించేదాక రాదు___

పాపం తన కసిబాకును
నాపైకే విసిరె నెవరో
వజ్రాయుధమే నాకు
వశమైపోయిన దెరుగక ....

గగన మధ్యమున నిశిత
కాంతిని చిమ్మె నాపై
కుటిలాత్ముడు ఎవడో
చీకటిదుప్పటి కప్ప జూచె
పురిటిలోనె నిశాగోళమును
కాల్చిన నన్నెరుగక ....

అమల సత్యమే రక్తమై
ప్రవహిస్తుంది నాలో
వీరత్వము గాండీవపు
నారులైన నా నాడులు ....

సౌందర్యము నా చూపుల
యందు వాసమై ఉన్నది
అభ్యుదయం నా స్ఫూట
మేధాకృతిగొని అవతరించె ....

ప్రకృతిలోన నేను
నాలో ప్రకృతి లీనమై ఉన్నది
నా ఓటమి ఈ జగద్వినాశమునకు సంకేతం
నావికాసమున లోకము నాకం అవుతుంది నిజం___

# నా తెలుగు వెలుగు వీణలు

నా తెలుగు వెలుగు వీణలుమీటి పాడెద
నా తెలుగుజాతి ఉన్నతిగీతి పాడెద —

వాడవాడల చెలిమి
మేడలను కట్టి
తెలుగుతల్లికి భావ
దీపాలు పెట్టి
నా తెలుగు వెలుగు వీణలు
మీటి పాడెద ....

నిన్న మొన్నటి స్మృతులు
నేటి అనుభూతులు
రేపటి మసకకలలు
నే పాటలుగ అల్లి
నా తెలుగు వెలుగు వీణలు
మీటి పాడెద ....

ఆనందముల తేలి
ఆవేదనల సోలి
ప్రణయ గీతులు కొన్ని
ప్రగతి పాటలు కొన్ని
నా తెలుగు వెలుగు వీణలు
మీటి పాడెద ....

లోకాన చైతన్య
రేఖలే కురియగా
శైశిరము లేని
వాసంతాలు విరియగా
నా తెలుగు వెలుగువీణలు
మీటి పాడెద ....

# కొరడాలు విసిరితే

కొరడాలు విసిరితే
కోకిలలు పాడునా
కొడవళ్ళు ఝళిపిస్తే
కొమ్మలు విరబూయునా___

ఈలవేసి జోలపాడి
గాలిని లాలించుమా
చెక్కిలి గిలిగింతపెట్టి
చుక్కల నవ్వించుమా___

మట్టిని ప్రేమించి చూడు
మణులు పండుతాయిరా
రాలను పలికించి చూడు
రసము చిందుతాయిరా___

శ్రమజీవుల కొలచి చూడు
చైతన్యం చిందునురా
పేదల ఎద తట్టి చూడు
పెన్నిధులే నిండునురా___

## మానవుడు - యంత్రమూ

మానవుడు - యంత్రమూ ఒకటై
మార్పు చక్రము త్రిప్పుచున్నవి
శ్రమము త్యాగము భావిభారత
జాతిసౌధము నిలుపుచున్నవి__

చేతనప్రభ పూచె నేడు
ఆ సేతుశీతాచలము నిండుగ
ఎన్నొ నవభావనల రాకెట్లు
ఎగసినవి నా హృదయరోదసి__

ఢిల్లిలో ప్రతిపల్లెలో
రాగిల్లె నవనిర్మాణ శోభలు
గనులలో క్షేత్రములలో
కింకిణులు మ్రోసెను భాగ్యదేవత -

నదులు నదములు ప్రేమసాగర
హృదయలై ఆ కొండ కోనలు
వీడివచ్చెను బీడు ఎదలకు
వేడుకలు సమకూర్చగా__

ప్రతిభరతపౌరునికి విద్యా
మృతము త్రాపును నేడు శారద
జీవితాశలు పండగా
వర్షించె ప్రజాస్వామ్య నీరద__

అయిదు అయిదడుగులుగ ముందుకు
అదుగొ భారతజాతి సాగెను
కాంతి చిమ్మెడి దివ్యసీమలు
కానుపించెను కనుల మేరల__

# సూర్యుణ్ణి చంద్రుడు

సూర్యుణ్ణి చంద్రుడు
చుట్టేసినాడు
గగనక్రీడల ప్రైజు
కొట్టేసినాడు—

నన్ను మించినవాడు
మిన్నులో లేడని
విర్రవీగే రవిని
పట్టేసినాడు—

మట్టిలో పుట్టిన
వట్టిసోమరి శశి
అదను కనిపెట్టేసి
ఆదిత్యునే మింగె—

పొట్టి సోముని బుర్ర
గట్టిదే యని మెచ్చి
పగలె చుక్కలు లేచి
పరవళ్ళు త్రొక్కినవి—

లోకబాంధవుడు ఓడి
చీకాకు పడుతుంటె
చూడతగదని నరుల
వేడుకొనె భూమాత—

(16-2-80 నాటి సంపూర్ణసూర్యగ్రహణ చిత్రం)

# నవ్వించబోయి

నవ్వించబోయి నేను
నవ్వులపాలైతిని
హాళియాడబోయి, నే
హేళనపాలైతిని —

హితమేదో చెప్పబోయి
హతాశయుడనైతిని
వెన్నుతట్టబోయి నేనె
వెన్నుపోటు తింటిని —

అభయమీయబోయి నేనె
అవమానము పొందితి
కేలూత నీయబోయి
క్రిందత్రోయబడితిని —

ఆపల్లక్ష్మికి అపోహ
లక్ష్మణుడనె అయితిని
దుఃఖితరాముని దృష్టికి
దురితవాలినైతిని —

చేయని నేరానికి నే
శిక్ష అనుభవించితిని
నిష్కామకర్మానికి
నిందలపాలైతిని —

# ఏమిటి సాధించాము

ఏమిటి సాధించాము
ఇంతకాలము?
ఏదో పేరున సాగే
ఇంద్రజాలము—

కుల నిర్మూలనము కోరి
కుల నిర్మాణం చేసి
మాటలోన కాస్త మెలిక
మాత్రమే వేశాము—

ఒరులపట్ల మనపట్ల
ఒకే నియమ మెందుకని
స్వవిషయంలో కాస్త
స్వార్థం పాటిస్తున్నాం—

చెప్పేది చేయకుండ
చేసేది తలపోయక
త్రికరణాలు దేని కది
శుద్ధిగపాటిస్తున్నాం—

జాతిపక్షి నెమలి సరే
జాతిసుమం పద్మం సరే
జాతిగుణం ఏమిటంటే
మోసమనిచెప్పాలా !

## ఓ భారతదేశ మూలస్తంభమా

ఓ భారతదేశ మూలస్తంభమా
ఓ భారతజాతి శాంతిబింబమా
ఒరిగిపోయితివా నేడు నేలకు !
తరలిపోయితివా స్వర్గసీమకు !

విశ్వజనాశాజ్యోతిని
విషవాయువు లార్పెనా
పుడమితల్లి హృదయంలో
బడబాగ్నులు రేపెనా !

ప్రతిదేశ పతాకలు,
క్షోభాభరమున వంగిపోయె
ప్రతిజీవనరంగము
పేదతనాన క్రుంగిపోయె —

బాలబాలికలు
చాచాజీ లేడని విలపించిరి
పూలు గులాబీలు
నీ వరాలనవ్వులేక వాడె —

ఆ సంద్రములందు
నదులయందెకాదు నీ - మహాత్మ
కలసిపోయె దేశకాలముల
జీవననదులకూడ —

నీ ఆశలు ఆశయాలు
నెరవేర్చ ప్రయత్నింతుము
స్వాతంత్ర్య సమైక్యతలను
శాంతిని పరిరక్షింతుము —

(27-5-1964 నాడు భారతరత్న జవహర్‌లాల్ నెహ్రూ
అస్తమించినప్పుడు కురిసిన అక్షరాశ్రువులు)

# ఒరులను నిందించకు

ఒరులను నిందించకు
నీ విధిని
విస్మరించకు
చేతగానితనమును
చేతనగా చిత్రించకు___

మట్టికి స్వార్థంలేదు
మ్రాకుకు స్వార్థంలేదు
మనిషికున్నంత స్వార్థం
మరి దేనికిలేదు___

నీదేహం కన్న మిన్నగ
ప్రేమించుము నీ దేశం
నీ కుటుంబమున కన్నా
ఈలోకమును పోషించుము -

మంచిచెడుగులకు బాధ్యత
మనదే మనదే మనదే
స్వాతంత్ర్యానికి రక్ష
సమతాయుత సమైక్యమే___

# తేటగీత మైపోయె

తేటగీత మైపోయె
క్షేమ్మన్నది
ఆటవెలది అయిపోయె
ఆంస్టర్ డాము___

రోములోన తెలుగువాణి
రోమాంచము కలిగించె
మారీషస్‌లో తెలుగు
మాట తేనె చిలికించె___

తెలుగు ప్రతిభ టెహరానుకు
వెలుగుహస్త మందించె
తెలుగులగని అమెరికాయె
నిల్లువెల్లా పులకించె___

మలయాలో తెలుగుతల్లి
మల్లెపూలు ముడుచుకుంది
మాస్కోలో తెలుగుకవిత
మైత్రిభాష నేర్చుకుంది___

తూర్పు పడమరలు తలుపులు
తెరచి స్వాగతము పలికెను
భారతాత్మ వెలుగు తెలుగు
భారతికి కళాపతికి___

# ఉదాసీనముగ వచ్చే

ఉదాసీనముగ వచ్చే ఉగాదిలక్ష్మి
నిజంగానె కలుగుతూంది నీపై జాలి

వచ్చావో లేదో, ఏమి
తెచ్చావని అడుగుతారు
కొమ్మకొమ్మలో దాగి కోకిలమ్మలు
బడిబడిలో గుడి గుడిలో బాపనయ్యలు—

ఏ పేటా పేరుమార్చి
ఎలా నీవు వచ్చినా
ఊహాకల్పనలు చేసి ఉవ్విళ్లూరిస్తారు
సమయస్ఫూర్తి కలిగిన
సంప్రదాయులు
పచ్చడికే ముచ్చటపడు
పండితవరులు—

ఏ పేరున ఏ తీరున
ఏ పరువము తెచ్చినా
పాతచింతకాయ పచ్చడి వని తిడుతారు
అభ్యుదయులమనుకొనే
అల్లరికవులు
అసంతృప్తులు కుపితులు
అధునాతనులు—

నిన్ను ఎలా వర్ణిస్తే
నిజమౌనో ఋజువౌనో
ఎగిరించుము నీవే
హే! కాలాక్షీ
లోకజనానందముగా
ఓ లోలాక్షీ !

# ఎగసిపోయే నాహృదయమా

ఎగసిపోయే నాహృదయమా !
ఎంతదూరం పోదువే
ఈ దిగంతాలన్ని దాటి
ఏ జగాలకు పోదువే !

ఈ వసంతకుమారి నవ్వులు
ఇంతలోనె ఆరుననియా
ఏడురంగుల ఇంద్రచాపం
ఎంతసేపో నిలువదనియా....

ఆ సుమము చిలికించు గంధము
ఈ సుమము వెలిగించు అందము
కలిసి వెలిగే పూలకోసం
కలయజూచి నిరాశజెంది....

బ్రతుకుబాధ సహించలేవు
మరణమును ప్రేమించలేవు
నేలపై కాలూనలేవు
నింగిశిఖరము చేరలేవు....

నిన్ను వలచిన దాని నొల్లవు
నీవు కోరినదేమొ దొరకదు
వెలుగుచీకటి కలిసి తిరిగే
వింతలోకపు టంతుతెలియదు....

నీవు కలగన్నట్టి లోకం
నిజంగానే చేరగలవో !
ఇన్నిఊహలతో తపించి
ఎండమావుల మీరగలవో!

# మతకలహం

మతకలహం మ్రింగిందొక
మతాతీత మనిషిని
కత్తికాటువేసిందొక
కలమెత్తిన ఋషిని—

మానవతావాదానికి
ప్రాణంపోసిన - మూసీ
తీరం కన్నీరయ్యేను
ఆ రక్తపు ధారలలో—

మరుభూముల గుండెల్లో
మధుమాసం వెలిగించిన
లేగులాబి హాసమును
ద్వేషతమము మ్రింగెనా !

ఏకాకిగ ఉండికూడ
కోకిలమై పాడినాడు
త్యాగమె తనభోగముగా
తాదాత్మ్యము చెందినాడు—

ఏ వాసంతం కోసం
ఎలుగెత్తెనొ ఆ కోకిల
ఆ వాసంతమె పికమై
ఆతని స్మృతిగీతి పాడు—

(1983లో మతోన్మాదానికి ఆహుతియైన
యువకవి గులాంయాసీన్ స్మృతికి)

# హాలండులో

హాలండులో పూలపాట
విన్నాను
అమెరికాలో సిరులబాట
కన్నాను —

మంచుమల శిఖరాల
మౌనమంగళరవళి
ఆల్ప్సు కొండల గుండె
అంచులందున వింటి—

గంగపాడే పాట
రైనునోటా వింటి
యమునవలె థేమ్సు
రమణి పాడగ వింటి—

హిందూజలధి పాడు
హిందోళరాగము
శాంతసాగరములో
సావేరిగా వింటి—

ఏ ఊరువెళ్ళినా
మాఊరె కనిపించె
ఏమనిషిలోనైన
నామనసె భాసించె—

# కడలి అలల కలల

కడలి అలల కలల పుట్టిపెరిగినాము
లలితకళలసౌరభాలు మోసితెచ్చినాము
తీరవాసులం, దూర
తీరవాసులం___

నేలబాస గాలిబాస తెలుసు మాకు
నేడు కానరాని వెలుగుజాడ తెలుసు మాకు
తేనెపాటలం, ప్రగతి
చేరు బాటలం మేము....

దండినదులకన్న ప్రియము కొండవాగులే మాకు
తమ్మిపూలకన్న ప్రియము రెల్లుపూవులే
పేదగుండెలం, మంచి
ప్రేమజీవులం మేము....

అందము ఆనందమె కనులందీ మాకు
ఊహకందని నేస్తమే డెందము మాకు
కాంతిరేఖలం, విశ్వ
శాంతివాకలం మేము....

ఓటమన్నదెపుడు మాకు ఉండబోదు
మేము, ఓడునాడు భావియన్నదుండబోదు
సిరులమేరువులం మేము
చిరంజీవులం మేము....

# కంటకాల పథము

కంటకాల పథముమీద
కదలిపోవు పూలరథము
కొనిపోవును నన్నెవో
క్రొత్త క్రొత్త లోకాలకు—

ఎండమావి మోవిమీద
గున్నమావి రసకేళి
మందే చిరుగాలి ఎదల
మధుమాసం నాటెను—

కనుపించని సత్యపికము
వినిపించే భావరవము
ఆకులేని మాకులపై
అదృష్టము పండించెను—

చేదు బ్రతుకు గతుకలేని
మోదుగు విప్లవహాసం
వెలవెలబోయే ప్రకృతిని
వెలిగించెను రుధిరరుచుల—

# చిత్రము చిత్రము బాపూ

చిత్రము చిత్రము బాపూ
చిత్రము నీజీవితం
చిత్రము కురుక్షేత్రము
పవిత్రము నీ జీవితం—

దక్షిణాఫ్రికాలో
ధవళజాతి కుటిలనీతి
విలయతమోవలయంలో
వెలిగిన ధర్మజ్యోతీ !

సత్యం శాంతి అహింస
సాధనాలుగా చేసి
దాస్యజలధి ఎడద చీల్చి
స్వాతంత్ర్యము తెచ్చావు—

మనిషికి మనిషికి మధ్య
మమకారం సహకారం
బోధించిన నీతత్వం
భువనానందామృతం—

సకలశాస్త్ర మతసారం
త్రికరణశుద్ధే అని
ప్రకటించిన పాటించిన
ప్రగతియోగయోగీశ్వర !

నీ ఆశల అటన్‌బరో
నీ చేతల కిన్‌స్లే
రూపించిన చలనచిత్ర రూపము లోకవిచిత్రము
జగశ్శాంతి హితపత్రము- చిత్రము నీ జీవితం—

# చెట్టేమనిషికి తోడురా

చెట్టే మనిషికి తోడురా
చెట్టే పుడమికి నీడరా
చెట్టే మట్టికి ప్రాణంరా
చెట్టే గాలికి గానంరా !

చెట్టు పచ్చగా శిరమెత్తినచో
ఎండల గుండెలు అదరునురా
చెట్టు చల్లగా చిరునవ్వినచో
మబ్బులగుండెలు కరగునురా !

అడవిని పుట్టెను
ఆదిమానవుడు
అడవినె పుట్టెను
వేదమానవుడు
చెట్టేమనిషికి తోడురా—

చెట్టే పూలకు మేడరా
చెట్టే పక్షికి గూడురా
చెట్టే అన్నము పెట్టేది
చెట్టే ఇంటిని నిలబెట్టేది—

చెట్టే ప్రగతికి మెట్టురా
చెట్టే ప్రకృతికి పట్టురా
చెట్టు పెట్టుటే పుణ్యంరా
చెట్టు కొట్టుటే పాపంరా !

# మృదుమధుగీతానుభూతి

మృదుమధుగీతానుభూతి
ఎరుగని ఓ నా కలమా !
మధుమాసోషస్సులు
రానున్నవిలే వగవకుమా !

నీ వ్రాసిన జీర్ణ శిశిర
గీతాలాహ్వాన మొసగ
శుక పిక సమతా గాన
ప్లుత వాయుతరంగాల
నవవాసంతోషస్సులు
తమము చీల్చి వస్తున్నవి—

జర్జరితానల బాధిత
జీవిత సైకతపథాలు
అభ్యుదయ శ్యామల
సీమలకు చేరగనే
కంటకాలులేని బ్రతుకు
కావ్యాలు రచింతువులే—

(చిన్ననాటి రచన)

# పల్లెల్లో పేదరికం

పల్లెల్లో పేదరికం
ఇల్లు కట్టుకున్నది
శ్రమజీవుల బ్రతుకుల్లో
చిచ్చురేపుతున్నది—

ప్రణాళికలు పథకాలు
ప్రగతి విజయవ్యూహాలు
ఎన్నిటినైనా నాసరే ఎదిరిస్తూ ఉన్నది
పల్లెల్లో పేదరికం ఇల్లుకట్టుకున్నది —

స్వార్థంతో చేయికలిపి
మోసంతో మైత్రిచేసి
ద్రోహంతో భుజంకలిపి దోపిడిచేస్తున్నది
పల్లెల్లో పేదరికం ఇల్లుకట్టుకున్నది—

జడత్వాన్ని నింపుతూ
జవసత్వం చంపుతూ
వికట కపట 'విధి' మీద విశ్వాసంపెంచుతూంది
పల్లెల్లో పేదరికం ఇల్లుకట్టుకున్నది—

బ్రతుకలేని నిరామయులు
చితికి పోవు అమాయకులు
మార్పురథం ఎక్కకుండ మాయలెన్నొచేస్తూంది
పల్లెల్లో పేదరికం ఇల్లుకట్టుకున్నది —

# వచ్చినావా తిరిగి

వచ్చినావా తిరిగి
వాసంతలక్ష్మి !
తెచ్చినావా మరల
తేజోవనాలు___

చెట్టు చెట్టున మళ్లీ
చిరునవ్వు విరిసె
గట్టుగట్టున తిరిగి
గంధాలు కురిసె___

ఢిల్లిలో ఆశలు
హోలి ఆడినవి
పల్లెలో కలలెన్నో
పల్లవించినవి___

వేపపూవుల పిలిచె
విందునకు బెల్లం
చింతపండును వలచె
చిరుమావిపిందె___

నీ పలుకుతోటలో
నిలిచింది కాలం
నీ కీర్తిపాటలో
కరగె పికజాలం___

# పొదుపోయమ్మ పొదుపు

పొదుపోయమ్మ పొదుపు !
మదుపోయమ్మ మదుపు !

కలిగిన ఆదాయంలో మిగిలించుట పొదుపు
మిగిలించినదాన్ని పెంపుచేసుకొనుట మదుపు
మదుపోయమ్మ మదుపు....

పెళ్లానికి తెలియకుండ పెనిమిటి చేయాలి పొదుపు
భర్తల కంటే మిన్నగ భార్యలు చేయాలి పొదుపు
తల్లి ఇచ్చు చిల్లరతో పిల్లలు చేయాలి పొదుపు
కూడబెట్టి మదుపు పెడితె కుటుంబానికే అదుపు....

ఒకటో తారీఖేమో
ఉద్యోగుల పొదుపుదినం
పంట అమ్ముకున్ననాడె
పల్లెరైతు పొదుపుదినం
పొదుపోయమ్మ పొదుపు
మదుపోయమ్మ మదుపు....

కూలివాడు పొదుపుచేసి కుబేరుడై పోవచ్చు
కోటీశుడు పొదుపులేక కూలివాడు కావచ్చు
నిన్నపొదుపు చేసుకొంటె నేడులేదురా దుఃఖం
నేడు పొదుపు చేసుకుంటె రేపుకలుగుతుంది సుఖం.

చెప్పి రావు నష్టాలు - చెప్పి రావు కష్టాలు
అన్నింటా పొదుపు చేసుకున్నవాడె ఉన్నవాడు
పొదుపోయమ్మ పొదుపు....

# ఉషారాగమును

ఉషారాగమును
నిశానాగములు
ఓర్వలేక మ్రింగినవి....

రవి హృదయమ్మున
కవి హృదయమ్మున
కారుమబ్బు క్రమ్మినది....

నేలతల్లి ఇటు
నింగితండ్రి అటు
క్రుంగి క్రుంగి ఏడ్చినవి....

మమతల పూవుల
మనసుల తీవెలు
మసలి విధిని దూరినవి....

ఎక్కడో వెలుగు
చుక్కపాపల
మరొక్కతార చేరినది....

# బయలుదేరా రదే

బయలుదేరా రదే
బాలబాలికలు
భరతదేశము చూడ
విరిసేటి వెలుగులు__

వింతగా ఎంతయో
వెదకేటి కళ్లలో
విజ్ఞానదీపాలు
వెలిగిపోతుండగా
బయలుదేరా రదే బాలబాలికలు....

చిన్నారి భంగిమల
చెన్నారు చేతులు
చిత్ర చిత్రా లెన్నొ
చిత్రించుచుండగా
యువగీతములు పాడు నవశక్తి పాదాలు
దూరతీరాల దరి చేరబోతుండగా
బయలుదేరా రదే బాల బాలికలు....

డెందాలకు అందాలు
విందు చేస్తుండగా
ప్రకృతిగని, ప్రగతిగని
పరవశములో తేలి
బయలుదేరా రదే బాల బాలికలు....

# మంచుకొండ గుండెకరగి

మంచుకొండ గుండెకరగి
మన నదులై పారు
భరతమాత ఇంట, కరువు
కాటకాలు తీరు....

గంగా పావనజలాలు
గోదావరిలో సాగు
గోదావరి తరంగాలు
కావేరి గళాన మ్రోగు...

కాశ్మీరపు రోజాలను
కన్యాకుమారి వలచె
కోణారక శిల్పాలను
కజరాహో ఆత్మతలచె...

అంబాలా ఊలవేయ
అగర్తలా గర్జించును
భరతజాతి సమైక్యత
ప్రగతికోట నిర్మించును...

# దురాశపరునికి

దురాశపరునికి
నిరాశయేరా
పరాన్నభుక్కుకు
పరాభవంరా !

పరులను దోచే
పరాన్నభుక్కుకు
మిగిలేదల్లా
వగపుల మూటే
తగిలేదల్లా
గల్లచపేటే —

దురాశచేయని
దురితముండదు
పరాన్నభుక్కుకు
పౌరుషముండదు —

దురాశచేసే
దొరతనమ్ములో
పరాన్నభుక్కుల
పరిపాలనలో
గరిక తినేటి
గాడిదలే చెడు
మరకతమణులై
గరిక నిలబడు —

# కర్షకులు కార్మికులు

కర్షకులు కార్మికులు
క్రాంతికథానాయకులై
సృష్టిచేస్తున్నారు
నవభారత యువచరిత —

నా గేటిచాలులో
నాడు సీత పుట్టినట్లు
వట్టిమట్టిలో నేడు
వరలక్ష్మి పుట్టె
పొగగొట్టపు ఊపిరిలో
ప్రగతిలక్ష్మి పుట్టె —

బీడుభూమిలో రణించు
ఏటినీటి గజ్జెలు
శ్యామలసీమల్లో
జయశ్రీ ఝణంఝణలు
నీటిచుక్క బొగ్గుముక్కల్లో
విద్యున్మాలలు

ఉత్తరాన గోధుమాద్రి
క్రొత్తగొంతు సవరించె
వరిగౌతమి దక్షిణాన
తరగలెత్తి నినదించె
తూరుపున తైలధార
వెలుగుల్లో ముంచె
పడమరను ఆనందము
పాలల్లో ముంచె
భరతావని పచ్చల ఎద
భలే పులకరించె !

# పల్లెలన్నీ ఢిల్లికేగి

పల్లెలన్నీ ఢిల్లికేగి
తల్లడిల్లే రోజుపోయె
పల్లెపల్లెకు ఢిల్లి వెళ్ళి
చల్లలమ్మే రోజు వచ్చె—

పల్లెలంటే కాదు ఇపుడు
ఇరులముల్లెలు
ప్రగతి సూర్యుని సుగతిగీతుల
పాలవెల్లులురా !

నేలదున్నేవాడు కాదిక
నిస్సహాయుడు
నింగికొసలను తాకి పొంగే
నిర్జరుంతురా !

నీటికోసం నోరుతెరచిన
బీటుభూములు
ఏటికాల్వల గతుల, పైరు
పాటలల్లునురా !

బడుగుజనముల తరతరాల
బ్రతుకు కోరికలు
తీర్చవచ్చిన నవవసంతపు
తీపిగాన మిదే !

# కాలేందిర

కాలేందిర పిలిచింది
కష్టజీవుల
కరకుకాల నలిగినట్టి
గడ్డిపూవుల___

మంచు లేచి నడుస్తూంది
మంటలు కక్కేస్తూంది
కోకిలపాషే ఋతులను
కాకము సరిచేస్తూంది___

ఉదధి ఊడిగముచేసే
నదులు సమ్మెచేస్తున్నవి
కామందుల విడిచిపెట్టి
భూములు గర్విస్తున్నవి___

చెట్లచెవుల ఇరులగుట్లు
పిట్టలు చెప్పేస్తున్నవి
తరులేమొ గ్రహించినట్లు
తలలూపేస్తున్నవి ___

# మౌనమేల మంజీరా !

మౌనమేల మంజీరా !
మాటలాడు నాతో
చెప్పరాని దేమిటి, నీ
చెలిమికోరు నాతో—

పేరుకు తగినట్లు నీవు
ప్రేమరాగ మంజీరవె
ఊరుకు తగినట్లు పాట
తీరు తు మ్మెదకు జోడే—

ఏదో అనుభూతికి, నీ
ఇంటిముందు వేచియుంటి
అడగకుండనే పెట్టే
అమ్మవు నీవని వింటి—

తరతరాలచరిత్రను
తలనిండా ముడుచుకున్న
నాదమంజరీ పలుకుము !
నాభావ విపంచికపై—

పాడుటయే ప్రాణముగా
ఆడుటయే మనుగడగా
వెలిగే మంజీరా ! నీ
వెలుగే నా ఆదర్శం —

(1980లో మెదకుజిల్లా గుండెలో చిలికిన మంజీరానదీనాదం)

# అందరు పాడే పాట

అందరుపాడే పాటొకటున్నది
అదియే స్వేచ్ఛాగానం
అందరి నీడై తోటొకటున్నది
అదియే భారతదేశం —

గంగాఝరిలో
గోదావరిలో
పొంగే అఖండగానం
భారతజాతికి ప్రాణం—

హిమగిరి గళమున
హిందూజలనిధి
వినిపించే సందేశం
విక్రమ భారతదేశం —

అంబాలాలో
అగర్తలాలో
స్వనించు దేశభక్తి
స్వతంత్ర భారతశక్తి —

# ఎగసిపోయితి

ఎగసిపోయితి ఎగసిపోయితి
ఎపుడు ఎగరని అంతదూరము
సింధువులు సేతువులు దాటి
చేరబోయితి క్రొత్తతీరము—

"లోకమా, సురలోకమా" అని
లోచనాలు విస్తుపోయిన
ఖండమందున కాలుమోపితి
కలను వాస్తవికతను చూచితి—

సీతనెప్పుడు విడని "రాముని"
చిన్న మచ్చయులేని "చంద్రుని"
రాజ్యకాంక్షలేని "రాజును"
రాగపీఠముమీద చూచితి—

ప్రేమదండము పూని, హృదయా
రామసీమల నేలు రాజు
రాజులును దినరాజు బాపని
బ్రతుకు చీకటి బాపు రాజు—

అతని హస్తము "అన్నపూర్ణ"
ఆత్మ "మురళీ"గాన ఘూర్ణ
నవ్యజీవన "ప్రభా" జనకుడు
నరుడో "నారాయణుడో" అతడు !

# తేవాలి నోబెల్ బహుమతి

తేవాలి నోబెల్ బహుమతి
తెలుగుతల్లికి
మణిమకుటం పెట్టాలి
మనభారతికి___

మనిషి మనిషికీ మధ్య
ప్రేమమందిరాలు కట్టు
ఆగమశిలాప్రక్షరాలు
త్రికరణాల పలికించి
తేవాలి నోబెల్ బహుమతి
తెలుగుతల్లికి___

ఖండ ఖండముల గుండెలు
అఖండమాలగా కూర్చి
సమతా సౌభాగ్యరమకు
శాశ్వతతోరణం తీర్చి
తేవాలి నోబెల్ బహుమతి
తెలుగుతల్లికి___

ఆనందస్యందనాన
ఆబాలగోపాలం
తేలిపోవు శబ్దపథము
కాలాటవిలో వేసి
తేవాలి నోబెల్ బహుమతి
తెలుగుతల్లికి___

చుక్కలతో శూన్యంతో చుట్టరికం నెలకొల్పి
మనిషికి దేవునికి ఒకేమాతృభాష నేర్పించి
తేవాలి నోబెల్ బహుమతి తెలుగుతల్లికి___

## బేలూరు

బేలూరులో, హళే
బీడులో శిల్పాలు
చూడకుంటె లోకంలో
చూచిందేముంది !

ఎవరి గుండెమంటలోనో
మాడి బండలైపోయిన
సుందరతను స్పందనతను
చోద్యంగా బ్రతికించిన
దిట్ట లెవ్వరో కాని
వట్టిశిల్పులా? కారు
రాతినాతిగా చేసిన
రామచంద్రులే వారు —

వెన్నముద్ద లెన్నెన్ని
తిన్న చిట్టిపాపలైన
జున్నుముద్ద లనుకొని
జుర్రబోదు రాశిలలను —

రాళ్ళవిలువ తెలిసినట్టి
రాజులు రాణులు ఎవరో
రాజ్యాలకన్న మిన్న
రాళ్ళను ప్రేమించరేని
కనకపుదుర్గాల కన్న
కళలను ప్రేమించరేని
దివిని వీడి దేవత లీ
గుడులచేరి ఉండేరా !

కాలాహి శిరంమీద కాంతిదీపకళికలవలె
వెలిగే ఆ శిల్పమణుల వెలుగులోన వెలుగుదాం—

# పెంపులేదు

పెంపులేదు లోకానికి
పిచ్చయ్యలు లేనిదే
పొందలేము ఏ ప్రగతీ
కొందరి మతి పోనిదే !

పిచ్చిప్రశ్న కలిగించిన
పిచ్చి వలన ఓ అయ్య
వామలూరు వాడైన
వాల్మీకీ పిచ్చయ్యే !

రాగ, భోగ, త్యాగ, యోగ
రహస్యాలు, ఆటవెలది
వేదముగా కూర్చిన
వేమయ్యా పిచ్చయ్యే !

చేతికర్రతో జగ
జ్జేతల నెదిరించి, భరత
జాతికొరకు బలియైన
తాతయ్యా పిచ్చయ్యే !

నేలగుట్టు కనిపెట్టిన
న్యూటనయ్య పిచ్చయ్యే
నీటిగుట్టు కనిపెట్టిన
మేటికూడ పిచ్చయ్యే
పెంపులేదు లోకానికి
పిచ్చయ్యలు లేనిదే....

# భావము లొకటై

భావము లొకటై
భాషలు ఒకటై
భారతవనిలో పూయాలి
స్వార్థం పెట్టిన
మోసం కట్టిన
గోతులు, గోడలు మాయాలి—

ప్రజాస్వామ్యమును
మ్రింగచూచెడి
పన్నగాల పనిపట్టాలి
సంఘద్రోహమే
సేవగ చూపే
గారడీల పసిగట్టాలి—

కష్టంచేసే వారెవరైనా
కన్నీళ్ళకు గురికారాదు
ధనధాన్యాలు బుద్ధి భుజాలు
స్వార్థానికి లోబడరాదు—

నిరక్షరాస్యత నిరుద్యోగము
నిలువున నీరై పోవాలి
అమితోత్పత్తులు మితకుటుంబములు
అందరి లక్ష్యం కావాలి—

# మసూరీని చూడరా

మసూరీని చూడరా
మదోన్మత్త ఇంద్రుడా!
అగుపడదా నీ కళ్ళకు
అసలు స్వర్గ మిదిరా—

కొండల గుండెల పూచిన
కోర్కెల మబ్బుల దండుల
సుందరచిత్రాసకేళి
చూడని నీ బ్రతుకెందుకు?

లోతు లోతు లోయల
అనుభూతుల గీతులు పాడే
నిర్ఝరి నర్తకుల ముందు
నీ అచ్చర లేపాటి?

చెలి వెచ్చని హేమంతము
చల్లని వేసవి హాసము
శిలలే పూలైపోయెడి
చిత్రమైన వాసంతం—

అన్ని కన్నులున్న నీకు
అగుపించని నాకమును
నాకన్నులతో మానవ
లోకమున చూపెదరా—

# నైలునది ఒడ్డుమీద

నైలునదిఒడ్డుమీద
నాగరికత కట్టుకున్న
గుడులు చూచితి
పిరమిడులు చూచితి—

నిస్సహాయతా జీవిత
సహారాఎడారిలోన
కాలం పాఠాలు నేర్పు
బడులు చూచితి
పిరమిడులు చూచితి—

ఆకాశపు ఫలకంపై
అమరకవిత వ్రాయుటకై
భూకాంత చేపట్టిన
భూరిగంటపు వజ్రపు
పిడులు చూచితి
పిరమిడులు చూచితి—

శిథిలమైన చరిత్ర
పదిలముగా దాచుకున్న
తలపుముత్తెముల మూటల
ముడులు చూచితి
పిరమిడులు చూచితి—

మధ్యధరాసాగరం
మహానందమున పొంగి
చీకటిఖండాన రాశి
పోసినట్టి వెలుతురు
పుప్పొడులు చూచితి
పిరమిడులు చూచితి—

# ఆరిపోవని వెలుగు

ఆరిపోవని వెలుగుచిమ్మి
ఆరిపోయిన దీపికా !
వాడిపోవని పూలు పూచి
వీడిపోయిన వల్లికా !

పోరుబందరులోన నీవు
పుట్టినప్పటినుండి గాంధీ !
పోరు సల్పితివయ్య భారత
పారతంత్ర్యము తీరుదాక___

మానవత్వకై నీవు నాటిన
మహిత సత్యాహింసవాటిక
కులమతత్వపు దానవత్వపు
క్రూరమృగముల పాలబడియెను___

సామభేదోపాయములచే
శత్రువుల జయింపవచ్చును
మిత్రరత్నములట్లు కులికే
శత్రువులను జయించు టెట్లు ?

అందరికి నీవన్న ప్రియమే
అందరికి నీవాక్కు లమృతమె
ఎంద రిల నీ సత్యమార్గము
నందు నడతురొ నీ వెరుగవే !

నీ స్మృతిప్రభ మాసిపోక
నీ శ్రుతి సుమాల్ వాడిపోక
జగతినే అభ్యుదయ శాంతి
జాహ్నవిగ నడపించుగాక !

# పండగంటే నేడె

పండగంటే నేడె పండుగ
పల్లెకైనా, క్రొత్త ఢిల్లీకైనా
పేదవాడికైనా, సిరులమేడకైనా—

భాషలన్ని సమతా
భాషలైన రోజు
కులమతాలన్ని భరత
కులాభిమతమైన రోజు—

సకలజనానందం మన
సంస్కృతియైన రోజు
నవభారత నిర్మాణము
నాగరకత అయిన రోజు—

ఆశలు మనఆశయాలు
హక్కులైన రోజు
ఓటుహక్కు అన్నిటిలో
మేటియైన రోజు—

ప్రజలే పాలకులైన
పర్వదినం నేడు
బాధలు భేదాలు మరచి
పాడుకునే రోజు—

(రిపబ్లిక్ గీతం)

# లేదురా, లేదురా, లేదురా!

లేదురా, లేదురా, లేదురా !
కులానికి అర్థం లేదురా
లేదురా లేదురా లేదురా
మనిషికి మనిషికి తేడా లేదురా !

పుట్టిన తీరందరిదీ ఒకటేరా
గిట్టిన వారందరి దారొకటేరా
చాతుర్వర్ణాలు కులాలు
స్వార్థపరులు కల్పించినవేరా !

భరతసమాజం ముక్కలుచేశారు
పాలకడలిలో విషంపోశారు
లెక్కలేని కులాల వలవేశారు
దిక్కులేని పక్షులుగా చేశారు—

మనజాతి చేవను చంపిందిరా కులం
మనచరితను మలినం చేసిందిరా కులం
మనసమాజ దురాచార కారణం కులం
తరతరాల దరిద్రాల కారణం కులం—

ప్రేమకు ఆదర్శం కులం కాదురా
మైత్రికి ఆధారం మతం కాదురా
కులాతీత మతాతీత వివాహాల పునాదిపై
భావిభారత సమైక్య భవనం నిర్మించరా!

# అదుగో భారతివదనం

అదిగో భారతివదనం
ఆనందసదనం
ప్రగతిలక్ష్మి ఉదయించే
పాలకడలి మథనం

బీడు భూములను వెదకుచు
ఏటి తరంగాలు వచ్చె
ఇరుల డొక్కలను చీల్చుచు
సిరుల వెలుతురులు వచ్చె—

ప్రతిరాతిరి చుక్కలు దిగి
పట్టణాల పైవ్రాలు
నడిపించును ఉత్పత్తిని
నవజీవన యంత్రాలు

అతిమితమౌ కుటుంబాలు
అమితమైన సౌఖ్యాలు
భావిభారతికి పట్టెను
ప్రతి ఇంటా దీపాలు—

# వచ్చింది వచ్చింది

వచ్చింది వచ్చింది
వాసంతము
వాసంతమూ - విజయ
భాస్వంతము___

మనజాతి మోముపై
మార్పు సుమహాసమై
మనదేశ రథముపై
మంగళ పతాకమై - వచ్చింది వచ్చింది....

పచ్చ పచ్చని చేల
పైట సవరించుకొని
తరుణ భారత చరిత
తలనిండ ముడుచుకొని- వచ్చింది వచ్చింది....

కొండ కోనలలోన
క్రొత్త గొంతులు మీటి
చీకు చింతల వెతల
చీకట్ల నెగదాటి - వచ్చింది వచ్చింది....

పాడిపంటలు కూర్చి
పరిశ్రమలు తీర్చి
ప్రతిపల్లె ప్రేపల్లె
పగిది చిత్రించుతూ
వచ్చింది వచ్చింది వాసంతము....

# సుఖారామం

సుఖారామం
సుహృద్ధామం
అవాలీ జగతి
అప్పుడే ప్రగతి—

కుచేలుడునూ
కుబేరుడునూ
"త్వమేవాహం"
సహోదరులుగ
బ్రతుకవలె నిరతం
అదే అద్వైతం—

కులం అంటే కొలిమిరా అని
మతం అంటే మాయరా అని
మానవతయే ప్రేముకతయే
మనిషి మనుగడ వెలుగుబాటని
చాటుటే సమత
సత్యమౌ నవత—

బ్రతుకు గదిలో భయం దుప్పటి
కప్పుకొని కనువిప్పలేక
మార్పు అంటే మరణ మనుకొని
విప్లవమును విలయమనుకొని
కలవరించే పలవరించే
పిరికిపందలు ధనంజయులై
లేచుటే క్రాంతి
దేశ - కాల సంక్రాంతి—

## శిశిరంలా ఈసు

శిశిరంలా ఈసు రాలిపోయింది
వాసంతంలా ప్రేమ విరిసింది___

మండుటెండలకు బెదరక
మావిగుండె పండింది
పేదవారి ఆశలట్లు
మోదుగు పూచింది....

శ్రుతి తప్పిన బ్రతుకువీణ
శ్రుతి చేసెను కోకిల
ప్రతి ఎద ఇందిందరమై
పాడె ప్రగతిగీతిక....

కూడియున్నవారి మధ్య
గోడలెందు కన్నది
దవ్వులగల జాబిలి
తన దరికి చేరుమన్నది....

# అదుగో ఆ చెట్టుమీద

అదుగో ఆ చెట్టుమీద
అయిదే పళ్ళున్నవి
వాటిమీద పక్షులేమొ
వందలు ఎగబడుతున్నవి....

ఇదిగో ! ఈ చెట్టుక్రింద
ఇంతే నీడున్నది
పెక్కు పసులు దాని కొరకు
పెనుగులాడుతున్నవి....

నింగిలోన ఒక్క మబ్బు
నీరు చేపుతున్నది
బీళ్ళు వేలుబీటలుగా
నోళ్ళు చాపుచున్నవి...

కరిగతిలో ఆదాయము
పెరుగుతునే ఉన్నది
హయగతిలో జనాభా
అందకుండ పోతున్నది....

# హాళేబీడులో

హాళేబీడులో కన్నులు అదిరాయి
బేలూరులో గుండెలు బెదిరాయి—

రాళ్లన్నీ గుళ్లల్లో
రసరాగం తీస్తుంటే
కాలమే మైమరచి
తాళం వేస్తుంటే
హాళేబీడులో కన్నులు అదిరాయి
బేలూరులో గుండెలు బెదిరాయి—

అందాలన్నీ గెలిచిన
బృందావన మల్లి
అద్దం ముందర నిలిచిన
ముద్దులగుమ్మ
గతకాల స్మృతివీణలు కదిలిస్తుంటే
వర్తమాన బంధాలను వదలిస్తుంటే
హాళేబీడులో కన్నులు అదిరాయి
బేలూరులో గుండెలు బెదిరాయి—

స్తంభించిన జడతనుండి
రంభోర్వశి నాట్యాలు
స్పందించిన ప్రస్తరాన
నందీశ్వర నాదాలు
శిల్ప కళా తపస్సిద్ధి
చాటుతుఉంటే
జీవరస రహస్తంత్రులు
మీటుతుఉంటే
హాళేబీడులో కన్నులు అదిరాయి
బేలూరులో గుండెలు బెదిరాయి—

# బాలలం బాల

బాలలం బాలలం
బాలకృష్ణ లీలలం—
బాలలం బాలలం
బాలాగళ మాలలం

కలలుగనే పూవులం
కళలలోని తావులం
ఆటలలో పాటలలో
ఆదమరచు జీవులం....

కన్నతల్లిదండ్రులకు
కదలాడే బొమ్మలం
భరతమాత పెంచుతున్న
భావి మావికొమ్మలం....

చదువుకొనే దీపాలం
సమత, నవత రూపాలం
నవ భారత మందిరాన
నవజీవన శిల్పాలం....

దేశభక్తి జాతిశక్తి
దీపించిన తారకలం
కులమతాల గొడవలేని
గుణధనులం రసధునులం....

బాపూజీ, చాచాజీ
భావాలు, ఆశయాలు
ప్రకటించే పాటించే
ప్రగతిరాగ గీతాలం—

# నా గేటిచాలులో

నా గేటిచాలులో
నడిచేటి కూలన్న
కాలమే నీ వెంట
కదలి వస్తుందిరా !

నీ పాదముద్రల్లో
నీలాలు మొలిచెరా
నీ చెమటలో తడిసి
నేల పులకించెరా !

దున్నేవానిది భూమి
దోపిడిది మరుభూమి
కష్టజీవే స్వామిరా
శ్రమశక్తికి సమామిరా !

నీకొరకు చట్టాలు
నిర్మింపబడ్డాయి
నీ ప్రగతియే దేశ
నిర్మాణ పథమురా !

పాలేరుపంచకే
రాలేని శ్రీలక్ష్మి
పేదోళ్ళపై ప్రేమ
లేనట్టి భూలక్ష్మి

నీ ఇంట నిత్యముగ నిలచి పోవాలిరా!
నీ పొందు సత్యముగ కోరి రావాలిరా!

# అమెరికాకు తెలుగువెలుగు

అమెరికాకు తెలుగువెలుగు లందించాను
డెట్రాయిటులో తెలుగుదేరా వేశాను—

నయాగరకు కూచిపూడి నాట్యం నేర్పి
న్యూయార్కుకు త్యాగరాజ గానం నేర్పి
తెలుగు కళల రంగవల్లి
తీర్చినాను —

కరోలినా ధూమగిరుల పేరిణి ఆడి
షికాగోకు హరికథా శీధువు పంచి
తెలుగు చెలిమి కలిమి దివ్వె
వెలిగించాను—

మిసిస్సిపీ మెచ్చుకుంది
తెలుగుపాకము
విస్కాన్సిన్ నేర్చుకుంది
తెలుగుపాఠము—

పిట్సుబర్గులో వెలసిన
వేంకటేశుడు
కాలిఫోర్నియా చేరిన
తిరుమలేశుడు
దిగ్దిగంతముల తెలుగుల
దీవించాడు—

# ఈలపాట

ఈలపాట పాడె - రైలు
జోల పాట పాడె - రైలు
పల్లె పల్లెను పలకరిస్తూ
ఢిల్లి చేరింది క్రొత్త ఢిల్లి చేరింది రైలు___

ఆగినట్టే ఆగి ఆగి - సాగినట్టే సాగి సాగి
ఊగినట్టే ఊగి ఊగి
ఊళ్ళు దాటింది రైలు ఏళ్ళు దాటింది___

వానచూచి చెదరలేదు - ఎండచూచి బెదరలేదు
చలిని చూచి వణకలేదు
యోగిలాగ త్యాగిలాగ
వెలిగిపోయింది రైలు వెడలిపోయింది___

కొండ గుండెలు తొలచుకుంటూ
కోన గుండెలు మలచుకుంటూ
పగలు కాస్త సిగ్గుమీటి-రేలలోఒక కన్నెగీటి
భోగిలా రసయోగిలాగ
పొంగి పోయింది రైలు పొరలి పోయింది___

ఆకసాన మబ్బుకన్న - అంగలేసే గాలికన్నా
చెట్టు చేమల పిట్టకన్నా
జోరు జోరుగ దౌడు తీసింది రైలు
పరుగుపందెంలోన గెలిచింది___

# సహకార జీవనం

సహకార జీవనం
సౌభాగ్య దాయకం
సహకార భావనం
సమతా సుధాకరం—

చేయి చేయి కలిపి
చేయాలి ఉత్పత్తి
మన ఐకమత్యమే
మనదేశ ప్రతిపత్తి

పిన్న పెద్దలు కలిసి
పెట్టుబడి పెట్టాలి
పల్లెటూళ్లను ప్రగతి
పట్నాలు చేయాలి—

నీటిచుక్కలు కలిసి
నీరధులు అయినట్లు
మనిషి మనిషీ కలిసి
మానవత కావాలి—

ఇరుగుపొరుగు కూడి
ఇరులు పోగొట్టాలి
భారతికి సహకార
హారతులు పట్టాలి—

# విధివిలాసవిమాన

విధివిలాసవిమాన
విహారణాసక్తుడై
నాకలోకముకెగసె
నవయువకు డొకడు—

లోకమున తనకీర్తి
వాకలై ప్రవహించె
నేలపెంచిన రవిని
నింగి ప్రేమించె—

ఆటలాడే వయసు
పాట పాడే వయసు
పక్షియై పైకెగసి
పవనమై పోయె—

తొలిసంజయే ప్రాలి
మలి సంజయయ్యె
రాగోదయము ప్రేలి
రక్తమై పోయె—

ఢిల్లియే తల్లియై
తల్లడిలి పోయె
దేశమే శోక సం
దేశమై పోయె—

(23-6-80 నాడు సంజయ్‌గాంధి దుర్మరణవార్త విని)

# గోదావరి కృష్ణ

గోదావరి కృష్ణ నేడు కూడిపాడగా
ప్రతిఆంధ్రుని ఎద సమైక్యభావమాడెగా!

జాతిని చీల్చిన గోడల జాడ మాసెరా
మూగవడ్డవీణ తిరిగి మ్రోయసాగెరా
కలలు నిజములై కన్నుల కాంతి నించగా
చరిత్రలో స్వర్ణయుగం తిరిగి మొలిచెరా!

గతమునుండి గుణపాఠం గరచి మెదలరా
ద్వేషానైక్యతల సమాధిలో పూడ్చరా
ప్రేమవనం నాటు యశశ్శ్రీలు పూయగా
శ్రమామృతం చల్లు సుఖం జాలువారగా!

పగిలిన ప్రతిజాలిగుండె పదిలపడెనురా
ప్రతిజాతియు స్వీయగృహము ప్రవేశించెరా
జాతిజాతికల భారతజాతి మనదిరా
శాంతి క్రాంతి కోరు తెలుగుజాతి మనదిరా!

జాత్యైకత విశ్వప్రేమ గీతిపాడరా
నవ్యజీవితాభ్యుదయోత్సవము సేయరా
గోదావరి కృష్ణ నేడు కూడిపాడగా
మహాంధ్రోదయ సౌభాగ్యమహిమ పాడరా!

(1-11-1956 ఆంధ్రప్రదేశ్ అవతరణ)

## ఇది మనభారతదేశం

ఇది మన భారతదేశం
ఎంతో సుందరదేశం
కలలు పంటలై పండే
కర్మభూమి ఈ దేశం—

ఈ నదులే మన ఎదలు
ఈ గిరులే మన సిరులు
ఈ గనులే మన కనులు
ఈ వనులే మన నిధులు
ఇది మన భారతదేశం ....

ఈ మట్టిని ప్రేమిస్తే
మణులు దొరలి పడతాయి
ఈ రాలను సేవిస్తే
సుధలు ఒలికి పడతాయి
ఇది మన భారతదేశం....

ఇట వెలసిన ప్రతిఊరూ
చరిత్ర భాండాగారం
ఇట వెలిగిన ప్రతిమనిషి
పురాసంస్కృతి సారం
ఇది మన భారతదేశం
ఎంతో సుందర దేశం....

# చీకట్లను తగులబెట్టు

చీకట్లను తగలబెట్టు
శక్తి పొంగు చేతులతో
వెలుగును వెలివేయకురా
వెర్రివాడా !

చీకటేదో వెలుగేదో
చేతనము జడమేదో
తెలియరాని వ్యూహానికి
బలికావద్దు
అజ్ఞాన పిశాచానికి
ఎరకావద్దు—

శాంతిపేరుతో అశాంతి
సమత పేరుతో అసమత
నీతిపేర అవినీతి
నడుపు కపట నాటకాన
విదూషకుడవై పోకు
విషాదాంతమై పోకు
హతాశయుడవై పోకు—

ముళ్ళమాటలు నమ్మి
పూల కుత్తుకలు కోయకు
రతనాలను రాళ్ళనుకొని
చితిలో పడవేయబోకు
ఆవేశపు మంటల్లో
ఆత్మహత్య చేసుకోకు

# ఏవీ! ఈ పూవులన్నీ

ఏవీ ! ఈ పూవులన్నీ
ఏమై పోతున్నాయి ?
పూలా ! అమ్మాయిల
జడపూలై పోతున్నాయి...

ఏరీ ! అమ్మాయిలంద
రేమై పోతున్నారు ?
అమ్మాయిలు అబ్బాయిల
అండ చేరుతున్నారు....

ఏరీ ! అబ్బాయిలంద
రేమై పోతున్నారు ?
అబ్బాయిలు సైనికులై
అనికి సాగుతున్నారు....

ఏరీ ! సైనికులందరు
ఏమై పోతున్నారు
సైనికులా చచ్చిపోయి
సమాధులౌతున్నారు....

ఏవీ ! సమాధులన్నీ
ఏమై పోతున్నాయి ?
పుణ్యమా సమాధులన్నీ
పూలై పోతున్నాయి....

ఏవీ ! ఈపూవులన్నీ
ఏమై పోతున్నాయి ?....

[ఒక అమెరికన్ జానపదగేయం విన్నతర్వాత
కలిగిన అనుభూతితో-]

# భారతీయుడౌటకన్న

భారతీయుడౌటకన్న
భాగ్య మేదిరా?
స్వాతంత్ర్యం కన్న మిన్న
స్వర్గ మేదిరా?

ఈశుడు వెలసిన హిమగిరి
ఎవరి కున్నది?
మనిషే దేవుడని నమ్మ
మనకు ఉన్నది—

ఆరిపోని గంగాఝరి
పారునెక్కడ?
భూసభాలు సంగమించి
పోవు నిక్కడ—

వేలఏండ్ల చరిత్ర ఏ
నేలకున్నది?
కాలాంబుధి తరచిన
వేదాల కున్నది—

సకలలోకశాంతి కోరు
జాతి ఎవరిది?
సహనము సంస్కృతియైన
సద్గుణులది మనది—

# ప్రశాంత జీవన ప్రదానేందిర

ప్రశాంతజీవనప్రదానేందిరను
నిశాచరత మ్రింగినది
విశాలభారతదేశం నిండా
విషాదమే క్రమ్మినది—

భారతరత్నగర్భంనుండి
పవిత్రరక్తం చిమ్మినది
కలలు మేలుకొను కాలపుత్రన్నుల
కారుచీకటి క్రమ్మినది—

దేశభక్తిపై త్యాగశక్తిపై
ద్వేషం దాడిచేసినది
శాంతికపోతిని ఆశాజ్యోతిని
స్వార్థం కూల్చివేసినది—

గంగాఝరిలో, గోదావరిలో
కన్నీటి అలలు పొంగినవి
అశేషమానవ హృదంతరాలు
ఆవేదనతో క్రుంగినవి—

స్వాతంత్ర్య సమైక్య సమగ్ర భారత
జాతివైభవం నిలబెట్టాలి
త్రికరణశుద్ధిగ అందరు
రక్షా దీక్షాంజలి పట్టాలి—

(31-10-1984 నాడు భారతరత్న ఇందిరాగాంధి
మతోన్మాదానికి ఆహుతియైనప్పుడు)

# అమెరికాలో ఆసిమోవు

అమెరికాలో ఆసిమోవు
అంతరిక్ష శిల్పి
దేశకాల దేవాలయ
ఆగమశిల్పి—

కలల శిలలు తొలిచి
కాంతిరేఖలుగ మలిచే
త్రికాల త్రిముఖాల
త్రిభువనభవనశిల్పి
జిజ్ఞాస ప్రజ్ఞాన
ఉపజ్ఞా శిల్పి—

ఊహల ఉలితో
వాస్తవికతను
చెక్కిచెక్కి ఆనంద
సోపానము నిర్మించే
సునిశితశిల్పి—

విజ్ఞానపు వీధుల్లో
వేదాంతము బోధిస్తూ
నరనారాయణులు కలిసి
నడుపకయే నడుపునట్టి
మర్మచక్ర కర్మధర్మ
మాయారథశిల్పి—

# చూడాలి చూడాలి

చూడాలి చూడాలి చూడాలిరా
"పాడేరు" నొకసారి చూడాలిరా !

కొండ కొండకు నడుమ
గుండె లన్నీ పరచి
పచ్చ పచ్చని చేల
పండించు లోయలను
చూడాలి చూడాలి చూడాలిరా—

ప్రతిరోజు జలదాలు
పన్నీరు కురిపించ
అందాలు సెలయేరులై
ఆడుకొను సీమ
చూడాలి చూడాలి చూడాలిరా—

పురివిప్పి నటియించు
గిరిజనాభ్యుదయమును
నిదుర మేల్కొన్నట్టి
చైతన్య సింహమును
చూడాలి చూడాలి చూడాలిరా—

పక్షులు స్వేచ్ఛను
పాటలల్లే చోటు
వెలుగుతో చీకట్లు
వియ్యమందేచోటు
చూడాలి చూడాలి చూడాలిరా—

(తూర్పుకనుమల్లో ప్రగతిబావుటా ఎత్తిన
కొండసీమ ''పాడేరు'')

# సేవయనెడితావి

సేవయనెడి తావి జిమ్మె
పువ్వులం
శాంతియనెడి కాంతిజిమ్మె
దివ్వెలం—

పాడితప్పని ఆడితప్పని పిల్లలం
పాటపాడే ఆటలాడే వెల్లులం
దేశభక్తికి త్యాగశక్తికి రూపులం
మోసములను కూల్చివేసే తూపులం....

ఆస్తులు అంతస్తులు కులమతాలు
అడ్డులేక సాగు మాజీవితాలు
మనుషులందరు ఒక్కటే మాదృష్టిలో
మమతయే మధురాతిమధురం సృష్టిలో....

దీనులందరు మాకు కడు ఆత్మీయులే
ప్రాణులన్నియు ఆదరణీయములే
ఒరుల బాధలు తీర్చుటే మా మోదము
భువిని దివిగా మార్చుటే వినోదము....

అన్నిటా సమత్వ ధర్మం పెంచెదం
ఉన్నదేదో లేనివారికి పంచెదం
తలపులందు పలుకులందు నడతలందు
తప్పు తేడా లేక బ్రతుకుట మాకు విందు...

# బాలలారా! ఏలండీ!

బాలలారా ! ఏలండీ
భారతదేశం!
అణువణువున వెలగాలి
మీ దరహాసం—

ద్వేషవిషం పొంగించే
పెద్దలకన్న
ప్రేమరసం కురిపించే
పిన్నలె మిన్న—

మాయలు మోసాలులేని
మార్గం మీది
స్వార్థం సమరం కోరని
సత్యం మీది—

అనుభవం లేదు మీకు
ఔను నిజమే
దోపిడీలు దుండగాలు
పాపాలుచేయుటలో
అనుభవం లేదు మీకు
ఔను నిజమే—

ఆనందం పంచుటలో
అనురాగం పెంచుటలో
ఆరాటంకలమీరే
అవనిని పాలించండి

# కోరికలు కోకిలలై

కోరికలు కోకిలలై
కుహూ కుహూ అంటున్నవి
కొండ కోనల్లో
నాగుండె మావుల్లో
ఈ చైత్రోదయవేళ—

ఆశలు కుసుమాలై
ఆవులిస్తున్నవి
చెట్టు చెట్టుపై
నా కనుల గట్టుపై
ఈ వసంతాగమవేళ—

కలలు రామచిలుకలై
కలకలమని పాడేను
విపినవీధిలో
నా వీనులగనిలో
ఈ వర్షారంభవేళ—

బ్రతుకే పంచాంగమై
భావిని భావిస్తోంది
ఊరిమూల గుడిలో
నా ఊహల బడిలో
ఈ ఉగాది ఉదయవేళ—

# విజయం మీదే

విజయం మీదే! విజయం మీదే!
వీరభారత ప్రజలారా!
ఇసవై అమ్ముల విజయధనుస్సు
ప్రయోగించిన ప్రభలారా!

ఆగకుండ ఈ పుడమి బొంగరం
గిర గిర తిరుగుతు ఉంటుంది
వెలుగు చీకటికి మధ్య సంగరం
ఆగుతు సాగుతు పోతుంది___

కామరూపులు కాంతిశత్రువులు
పరాన్నభుక్కులు ప్రజాశత్రువులు
దాగిపోవుదురు వీగిపోవుదురు
వచ్చిపోవుదురు చచ్చిపోవుదురు___

జాగరూకతే జాతికి రక్ష
క్రమశిక్షణయే క్రాంతికి రక్ష
దృఢసమైక్యతే దేశపు రక్ష
దనుజశక్తులకు తప్పదు శిక్ష___

చైతన్యమ్మే చక్రం మీకు
దేశభక్తియే శంఖం మీకు
నీతినిజాయితి దైవం మీకు
నిత్యవిజయమే జీవం మీకు___

# నింగిలో వెలిగేటి ఓతారలారా!

నింగిలో వెలిగేటి
ఓతారలారా!
నేలపై మా తార
నిజమైనతార—

తారలని మీకెవరు పేరుపెట్టారో
మినుకు మినుకున కునకగానె
తారకలు గారు
మాతారముంచు అణుమాత్రులౌదురు మీరు—

రివ్వుమని బొంగరమురువ్వి మాతారవలె
పోటిబొంగరములను పొడిచేయగలరే!
శ్రోతల ఎదలు రసస్నాతలైపోవ
మాతారవలె మీరు గీతాలు పాడేర!

నవరసాలను మించు
నవరసము నించు మాటలు వచించు
ప్రవిమలహృదయ మాతారవలె!
మీరొకటియైన పలుకాడగలరే

తాడిత జగన్నిశాతార అమృతధార
తారా యశజ్జ్యోత్స్నలో రమ్యతారలై
తారదేహ విభూష తారలై వెలగండి
కలకాలము జగాన కళలు వెదజల్లండి.

(చిన్ననాటి రచన)

# ఈ భూమి పంచకు

ఈ భూమి పంచకు ఎప్పుడో ఒకసారి
అతిథిగా వచ్చిపోతుంది హేలి
అంతరిక్షపు బాటసారి__

చుక్కల్లో చుక్కయై
సూర్యునికి చుట్టమై
ఆకాశవనవీధి ఓ కపీశ్వరునివలె
చక్కగా వస్తుంది హేలీ
తోకచుక్క అనిపిస్తుంది హేలీ__

భూలోకమెల్ల పర్యాలోకనము చేసి
చిత్రమౌ విజ్ఞాన
చిత్రపటములు గీసి
కలవోలె కరిగిపోతూంది
హేలి
నిజముగా మెరిసిపోతూంది__

ఈ విశ్వవిద్యాలయప్రయోగశాలలో
పరిశోధనలుచేయు శాస్త్రజ్ఞుడోయన
హేలి సాధించేటి ప్రగతి
గమనించి
జోహారులర్పించు జగతి__

నడిరేయి నేనతని
నగుమోము జూచితి
త్యాగరాయని తంత్రి రాగమైపోయితి
మరల అతనిని కందునో
ఐన
అది ఏలోకమందునో__

# నాదేనాదే భారతదేశం

నాదే నాదే భారతదేశం
నాదే నాదేశం !
మోదంలోనూ
ఖేదంలోనూ
నాదే ఈదేశం!

నారక్తంలో, నా నాడుల్లో
నాదం నాదేశం
నాకన్నుల్లో, నాడెందంలో
వెలుతురు ఈదేశం—

కాశ్మీరంలో కలలే పూలై
పరిమళించునది నాదేశం
కడలి కెరటముల క్రాంతిపాటలో
పరవశించునది ఈదేశం—

గంగాఝరిలో గోదావరిలో
పొంగే చేతన ఈదేశం
ఢిల్లికి పల్లెకు చల్లని నెయ్యం
నెరిపే తల్లే నాదేశం

సద్గతి వేదం సమతావాదం
సంస్కృతియైనది ఈదేశం
మనిషిని దేవుని ఒకటిగ మలిచే
భూతలస్వర్గం నాదేశం—

# జనగణమన అధినాయక

జనగణమన అధినాయక
జాతీయగీత కవీ!
దేశకాలాతీత
దివ్య భావ విశ్వకవీ! —

నీ జయజయరావములే
మా జీవన శ్రుతులయ్యె
నీ స్వప్నములే పండిన
ఈ స్వేచ్ఛాభారతము
సస్యశ్యామలమయ్యె —

వేదోపనిషద్రసాల
నాదాత్మ పికమవై
కనపడి కనపడని సత్య
కాంతి వీణ మీటినావు
రసాక్షరానంద
వసంతాలు నాటినావు —

శీతాచల శిఖరమవై
గీతాంజలి పట్టినావు
నింగి నేల కలుపు, గాన
గంగాఝురివై నావు —

క్రాంత భారతి రథ
శాంతి కేతనము నీవు
మానవతా ప్రగతి చక్ర
సమతా చేతనము నీవు.

# బాపురెడ్డిగారి మరికొన్ని రచనలు

## SOME OTHER WORKS OF BAPU REDDY

* * * *

| | |
|---|---|
| బాపురెడ్డి గేయ నాటికలు | BAPU REDDY GEYA NATIKALU |
| బాపురెడ్డి గద్యకావ్యాలు | BAPU REDDY GADYA KAVYALU |
| బాపురెడ్డి పద్యకావ్యాలు | BAPU REDDY PADYA KAVYALU |
| అనంత సత్యాలు | ANANTHA SATYALU (Free verse) |
| వ్యవధిలేదు (అనువాదం) | VYAVADHILEDU<br>(A Translation of Dr. KNARIG BOYADJIAN'S English poems 'There is no Time') |
| ఇన్ క్వెస్ట్ ఆఫ్ హార్మొనీ | *In quest of Harmony*<br>(Collection of poems in English) |
| శ్రీకార శిఖరం | SRIKAARA SIKHARAM<br>(Collection of lyrics) |
| ప్రేమారామం | PREMAARAAMAM<br>(Collection of lyrics) |

* * * *